# చిల్లిగవ్వ



కొత్త లక్ష్మీరఘురామ్

ప్రచురణ:

నవీన గ్రంథమాల

విజయవాడ - 2

# నా మాట

నవల కాలక్షేపమునకు వ్రాసినది కాదు. కథా విషయము వ్రాయుట నాకు చాల కష్టమైన కార్యము. కాని ప్రపంచలో పురాతనమైన ఈ వ్యభిచారవృత్తి నిర్మూలన ప్రయత్నాభిప్రాయము ప్రజలలో కలుగజేయుటే నా ఆశయము. ఈ ఆశయము అడియాస అగుటకు అస్కారము లేకపోలేదు. కాని ప్రయత్నించి చూడదలచితిని. ఈ పుస్తకము నా పాఠకులలో ఒక్క స్త్రీలోగాని పురుషునిలోగాని పరివర్తన గలిగించ గలిచితే ధన్యురాలను.

న్యూ ఢిల్లీ,
14 అశోకరోడ్
21 - 6 - 63.

ఇట్లు
లక్ష్మీ రఘురామ్

4

## రచయిత్రి-
## ఇతర రచనలు

1. ఆంధ్రనారి
2. దారీ తెన్ను
3. మొగలిపొట్లం
4. మనలో మన మాట
5. హస్కు
6. సింగినాదము
7. ధన్యజీవులు

# చిల్లిగవ్వ

ప్రాకు పడగనీడ నిద్రిస్తున్న పసిపాపవలె, మంజువాణి అర్ధంతరపు సిరి ఊయలలో తూగుతూ జీవిస్తున్నది.

మంజువాణి పుట్టింది పల్లెటూళ్ళో. పెరిగింది కటిక పేదరికంలో. పుట్టినింట దరిద్ర జీవితమంటే, వెగటుపుట్టి, విరక్తి చెంది, ఒంటరిగా నగరానికి పారిపోయి వచ్చింది.

ఆమె దగ్గర డబ్బులేదు. ఉన్నదల్లా ప్రకృతి ప్రసాదించిన అందచందాలు మాత్రమే. సౌందర్యానికి మంచి మార్కెటువున్న సంఘంలో, సౌఖ్యాన్ని సంతరింప చేసుకోవడం ఎలాగో ఆమె చక్కగా గ్రహించింది.

*　　　*　　　*

దేవేంద్ర భవనాన్ని మరిపించకపోయినా, కనీసం గుర్తుకు తెచ్చే సుందరమైన గృహంలో ఆమె నివాసం.

పొద్దుపొడిచి, నాలుగు బారలు ఎక్కింది. అప్పటికి ఆమెకు మెలకువ రాలేదు. వంటిమీదనుంచి షిఫాన్ చీర తొలగిపోయినా, స్పృహ లేదు. బాగా అలసిపోయిన అంగన వళ్ళు తెలియని స్థితిలో, మైమరచి నిద్రపోతున్నది.

ఆమె పడకగది అంచాలదీవి. పసందుగా అలంకరించబడివుంది. అద్దాలతోనే ఆ గదిని నిర్మించారా అనిపిస్తుంది. ఇటుకగోడ అనేది కన్పించదు.

మంజువాణికి మెలకువ వచ్చింది. ఎదురుగావున్న నిలువుటద్దంలో తనరూపంచూసుకొంది. చెదిరిపోయిన కురులు ఆమె ముఖానికి అదో రకమైన అందాన్ని చేకూర్చాయి.

భక్తులకు భగవద్దర్శనమైతే ఎలాగుంటుందో, మంజువాణికి తన రూపం చూచుకోగానే ఎక్కడలేని సత్తువ, సంతోషం పుట్టుకొస్తాయి. ఈ లోకాన్ని జయించగలనన్న ధీమా ఆమెకు ఎక్కువవుతుంది. అనుదినం అదే తంతు.

తొలగిపోయిన చీరను సర్దుకొంది. పరులుచూస్తే ఎక్కడ దిష్టి తగులుతుందో నన్నట్టు, పమిట సరిచేసుకుంది.

ఆమెకు ఇంకా బద్దకం వదలలేదు. మెత్తని పరుపుపై వెల్లకిలా పడుకొని, ఇంటి కప్పుకేసి, ఏదో పురుగును పట్టడానికి తలక్రిందులుగా తపస్సు చేస్తున్న బల్లి వంక చూస్తున్నది మంజువాణి.

ఎందరు మహానుభావులు తన అందానికి దాసులు కాలేదు? వెలలేని కానులు కురిపించలేదు? వారందరిని తలచుకొని మంచువాణి గర్వాతిశయంతో చిరునవ్వు చిలికించింది.

"మంజరీ"

జవాబులేదు. మళ్ళీ అదే పిలుపు. అప్పటికీ జవాబు లేదు. రాణివాసంలో దాసీలకు అలుసు ఎక్కువ. మహారాణికి వచ్చినంత కోపం ముసురుకొచ్చింది మంజువాణికి.

పెంకులు ఎగిరిపోయేటట్టు "మంజరీ" అని మళ్ళీ కేకవేసింది.

"జీ, హుజూర్" అంటూ, చక్కగా ముస్తాబైన మగువ, పొగలుకక్కే కాఫీతో గదిలో ప్రత్యక్షమైంది. వేడివేడి కాఫీ కంటపడేసరికి, మంజువాణి వేడి చల్లారిపోయింది.

"నరనారీ నికేతనం నౌకరువచ్చి, ఈ జాబును ఇచ్చి, వెళ్ళాడమ్మా" అని మంజరి ఒక కవరు మంజువాణి చేతి కిచ్చింది.

మంజువాణి అతి నిర్లక్ష్యంగా కవరుచింపి, జాబును చదివి, అవతల పారేసింది.

"పదిగంటలకల్లా ఆఫీసుకు రమ్మని కబురు. సరే, త్వరగా స్నానానికి నీరుపెట్టు"

మంజరి స్నానాల గదిలో నీరు సిద్ధంచేసింది. గుబాళించే పరిమళ ద్రవ్యాలు ఆ నీటిలో కలిపింది.

మంజువాణి జలకం ప్రారంభించింది. సాధారణంగా ఆమె స్నానం కనీసం గంటసేపయినా పడుతుంది. అప్పటికి గాని ఆమెకు తృప్తివుండదు. కాని ఈ వేళ మాత్రం అరగంట లోనే ముగించింది.

పసుపుపచ్చని శరీరాన్ని మల్లెపూలవంటి తువాలుతో తుడుచుకొని, నిగునిగులాడుతూ, ఘుమఘుమలాడుతూ మంజువాణి స్నానాల గదినుంచి బయటపడింది.

అప్పటికే మంజరి టిఫిన్ సిద్ధంగా చేసి వుంచింది. చవులూరించే దోసెలు, నేతితో వేయించినవి తింటూ మంజువాణి మంజరి పాకశాస్త్ర ప్రావీణ్యం పొగడలేక చచ్చిపోయింది.

"ఇంత పసందుగా వంటచేసే నిన్ను పెళ్లాడేవాడు నిజంగా అదృష్టవంతుడే."

చిరుసిగ్గు మంజరి ముఖంలో తొంగిచూసింది. ఆమెలో పొంగుతున్న యౌవ్వనం జ్వలితమైంది.

"కమ్మగా వంటచేసిపెట్టే అమ్మచేతిలో అయ్యగారు కీలుబొమ్మ అన్నారే మంజరీ."

"ఏమోనమ్మా, అదేమిటో నాకు తెలియదు."

"ఎంత నంగనాచివే, ఇంతకీ పెళ్ళెప్పుడు?"

"నాపెళ్ళికేం తొందరొచ్చిందమ్మా, ముందు మీ పెళ్ళి. తరువాతనే......"

మంజరి చెప్పేది పూర్తి కాకమునుపే మంజువాణి జోక్యం కల్పించుకొని—

"అలాగా? అయితే ఎవరిని కట్టుకోమంటావో చెప్పు"

"నో అంటే కోటిమంది పరుగెత్తుకొస్తారమ్మా! మీరు పెళ్ళి చేసుకొంటే ఈ ఇల్లు ఎంతనిండుగా వుంటుందంటారు!"

"ఇంతకీ వరుడెవరో నిర్ణయించవే!"

"ఉమామహేశ్వరరావుగారు మంచివారేనమ్మా"

"ఏడ్చేడు" చప్పరించింది మంజువాణి.

"పోనీ, కృష్ణారావు"

"వట్టి దగుల్బాజీ; చేతిలో ఎర్రని ఏగానీలేని నిర్భాగ్యుడు"

"అయితే లక్ష్మీపతిని చేసుకోండి. కావలసినంత డబ్బువుంది."

"నిజమే, లక్ష్మికిపతే. నాకు పతికాగలయోగం అర్హత అతనికిలేదు. అతగాడిని మెడకు గట్టుకొని నేను అఘోరించం వలసిందే"

"మరయితే మదనమోహనరావుగారి మాటేమిటి?" అని మంజరి టేబుల్‌పైవున్న పూలమాలను మంజువాణి తలలో చక్కగా అమర్చి కిలకిలా నవ్వింది."

"మదనుడు మంచివాడే. డబ్బావుంది. ఉన్నడబ్బును ఎలా సద్వినియోగం చేయాలో తెలిసినమనిషి. కాని పెళ్ళి చేసుకోవడంమాత్రం......"

ఇంతలోకి టెలిఫోన్ గణగణ మ్రోగింది. మంజరి ఫోన్ దగ్గరకు పరుగెత్తింది.

"మదనమోహనరావుగారు మీతో మాట్లాడా లంటున్నారండి" అని మంజరి కేక వేసింది.

మంజువాణి రిసీవరు తీసుకొంది.

"హాలో మదన్ ఏమిటి విశేషం ?"

"నీతో అతిముఖ్యమైన విషయం మాట్లాడాలి?"

"చెప్పరాదూ?"

............

"ఫోనుమీద చెప్పడానికి వీలులేనంత రహస్యవిష యమా? ఏమిటో అది?"

............

"మన పెళ్ళి ఏమిటి? కల కంటున్నావా!"

............

"నీవు కారెక్కి వచ్చినా, లేక విమానంలోనే వాలినా లాభంలేదు. నీతో మాట్లాడ్డానికి నాకు ఇప్పుడు తీరిక లేదు. నేను వెంటనే నరనారీ నికేతనానికి వెళ్ళాలి"

.............

"ఆ ఏర్పాటు మీరు చూస్తారా? సరే ఏమి చేస్తాను? ప్రోగ్రాము మారింది. మీకోసం ఇక్కడే ఎదురు చూస్తుంటాను. సెలవు"

"ఏమిటీ పరిణామం? ఏమిటీ వైపరీత్యం" అనుకుంటూ మంజువాణి సోఫాలో వాలిపోయింది నిట్టూర్పుతూ.

# 2

మంజువాణి అద్దంలో తన ముఖారవిందాన్ని మరొక సారి చూచుకొని. మురిసిపోయింది. ముంగురులు సర్దుకొంది.

"మదన్‌కు మతి చలించలేదుగదా!" తనలో తానే గొణుగుకొంది. దీర్ఘంగా ఆలోచించసాగింది.

అయినా తనకు ఇప్పుడే పెళ్ళెందుకు? పెళ్ళికానందున వచ్చిన లోటేమిటి? తనకు, మదన్‌కు మధ్య సంబంధాలు సజావుగా, హాయిగా సాగిపోతుండే!

పెళ్ళి చేసుకొంటే అడుగడుగునా ముళ్ళే. పుస్తెకట్టిన నాథుడు సుగ్రీవాజ్ఞలు పాలించాలి. లేకపోతే రభస తప్పదు. సంఘంలో నగుబాటు తప్పదు.

అందలం అందీ అందకుండా వుంటేనే అందం, ఆకర్షణ. అందలం అందిన మరుక్షణం ఆకర్షణలేదు. మిగిలేది వెగటు.

పచ్చగావున్న పదిమందినీ తాను ఇప్పుడు ఆకర్షిస్తున్నది. అందంనుంచి విలువైన బహుమతులు అందుకొంటున్నది. ప్రతివాడు ఆసక్తితో, ఆశతో తన చుట్టూ చేరుతున్నాడు. తన జీవితానికి అర్థాన్ని, సార్థక్యాన్ని చేకూర్చి పెడుతున్నాడు. బ్యాంకులో కాతా పెరుగుతోంది. పరపతి హెచ్చుతోంది.

ఎవడికో ఒకడికి తాను అర్థాంగినైపోతే, ఇతరులు తన పట్ల ఆశలు వదులుకొని, దూరమైపోతారు. ఇక కట్టుకొన్న వ్యక్తి పెట్టే యమయాతనలకు అంతే వుండదు.

యౌవనం ఉడిగి, అంద విహీనమైన అవసాన దశలో పెళ్ళికాని స్త్రీ పడే యాతనల సంగతా? ఆ మాట కొస్తే పెళ్ళయిన స్త్రీకి మాత్రం అలాంటి తిప్పలు తప్పవనే గ్యారంటీ ఎక్కడుంది?

ఇప్పుడు జీవితం ఎంతో హాయిగా సాగిపోతుంటే పెళ్ళి కావడం, పిల్లలను కనడం వాళ్ళను సాకడం, మొగుడితో తిట్లు తినడం, శృతిమించితే దెబ్బలు పడడం, ఇదేగా సంసార సుఖం?

దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్న పెద్దల సలహాలలో సత్యంలేదా? పరిస్థితులు ఎప్పుడూ ఇలాగే వుంటా యన్న హామీ ఏమిటి? వయసులో వున్నప్పుడే స్థితిపరుడైన వాడిని పట్టుకోవడం మంచిది కాదా!

తన తల్లి మాటలు జ్ఞాపకముచేసుకుంది. కృష్ణారావు సాని భాగ్యం ఎట్లా వృద్ధాప్యంలో కుమిలి పోతుందో ఆలో చించుకొని హడలిపోయింది. తననీ యింకో పదేళ్ళ తరువాత ముట్టరా? అబ్బో, భరించరాని నిర్భాగ్యమనుకుంది. పెండ్లి చేసుకుంటే ఏదో గంతకుదగ్గ బొంతగా కాలక్షేపము చెయ్య వచ్చు ననుకొన్నది. యిప్పుడు పెళ్ళిచేసుకొని సుఖాలన్ని టికి తిలోదాకాలిచ్చే దానికన్నా ముసలిదైన తరువాత పెండ్లి చేసుకోవచ్చును గాని ఆలోచించింది. కాని అప్పుడు తనని చేసుకొనే వాండ్లు వుండవద్దూ! ఎవరో ఒకరు వుండకపోతారా? ఎవరో ఒకరు వుంటే ఏమిలాభము? యింత బ్రతుకు బ్రతికి వృద్ధాప్యములో వంటచేస్తూ అంట్లు తోము

పోగలనా? అబ్బ! జీవితము ఎంత దుర్భరము, అటు గొయ్యి యిటు నుయ్యిగా వుంది.

మంజువాణి చెప్పనలవికాని సంకటావస్థలో పడి పోయింది. ఎందుకైనా మంచిది. ఎటువచ్చి ఎటుపోతుందో, కాస్త జాగ్రత్తగా వుండడం మంచిదనుకొంది.

ధరించిన షిఫాన్ చీర పురుషుడిని రెచ్చగొట్టేదిగా మంజువాణి భావించింది. కంజీవరం పట్టుచీర కట్టితే, సంసార స్త్రీ రూపు వస్తుంది. అప్పుడు మదనుడు చిలిపిమాటలకు, వెకిలి చేష్టలకూ దిగడు.

మంజువాణి ఇలా అనుకోవటమేమిటి, చీర మార్చడ మేమిటి, అన్నీ చిటికెలో జరిగిపోయాయి.

రవిక మార్చటమా లేదా అన్నది పెద్ద సమస్యగా ఘనీభవించింది ఆమెకు. పట్టుచోలీ ధరిస్తే, తాను కేవలం పుణ్యాంగన రూపు ధరించడం భయం. ఛీ. ఛీ, అప్పుడు తన అంగసౌష్టవం ఎదటివారికి కన్పించే అవకాశమే వుండదు. అందచందాలను దాచుకొనే పీనాసికాదు తాను. అయినా, తనకు అలాంటి కర్మమేమి వచ్చిపడింది?

సన్నని జార్జెట్ రవికే వుంచుకోవాలన్న నిశ్చయానికి మంజువాణి వచ్చింది. ఏ శరీర భాగాన్ని దాయాలో, సరిగా ఆభాగాన్నే ఆ రవిక దాచడంలేదు. అది ఫేషన్ మరి!

మంజువాణి తన పమిటను సర్దుకోవడం అనే మిషతో బిగువైన తన వక్షోజాలను ఒకసారి చూచుకొని, తనకు తానే మురిసిపోయింది.

ఇంతలోకి ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది. వెళ్ళి తలుపులు తీసింది. ఇంతకు ముందు అయితే మంజువాణి మదనుడిని కౌగలించుకునేటంత పనిచేసేది కాని ఇవాళ మాత్రం సంసారస్త్రీవలె మెలగ సాగింది.

ఎంతలో ఎంత మార్పు?

మంజువాణి మదనుడితో కరస్పర్శ మాత్రంచేసి, మర్యాదగా "కూర్చోండి మదనమోహనరావుగారు" అంటూ ఆహ్వానించింది.

ఈ మార్పుకు మదనుడుకూడా ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి, ఈవేళ నీలో ఇంతమార్పు వచ్చింది? లేనిపోని మర్యాద చేస్తున్నావే!"

"మీరు నాకు కాబోతున్న భర్తగారుగదా?" అంటూ మంజువాణి కిలకిలా నవ్వింది.

దానితో మదనుడు గుమ్మైపోయాడు. కొన్ని నిమిషాలసేపు మాట్లాడలేకపోయాడు.

---

# 3

మదనుడు, మంజువాణి ఎదురు ఎదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

మంజువాణి కొంటెచేష్టలు, క్రీగంటి చూపులు విసురుతూ మదనుడిని రెచ్చగొడుతోంది. ఆమె పయెద చీటికి మాటికి తొలగిపోతున్నది. 'నన్ను చూడు' అంటూ ఆమె వక్షోజాలు ముందుకువంగి తొంగిచూస్తున్నాయి. ఎక్కడ దిష్టి తగిలిపోతుందోనని మంజువాణి మరుక్షణంలోనే పమిట సర్దుకొని వాటిని కప్పేస్తున్నది.

పురుషుడిని రెచ్చగొట్టడం, ఊరించటం, మురిపించడం స్త్రీలకు మహా సరదా. మగవారి హృదయాలు ఎంతగా ఉక్కిరి బిక్కిరి చేయగలిగితే, మగువలకు అంత ఆహ్లాదం. ప్రకృతి వైపరీత్యం!

మదనుడి ముఖంలో ఆతురత, ఆందోళన, ఆవేదన, అన్నీ కలగాపులగంగా వ్యక్తమౌతున్నవి.

మంజువాణిని ఎప్పుడు తన దానినిగా చేసుకుందామా అని ఆతురత—

మంజువాణి తన మాటను ఎక్కడ నిరాకరిస్తుందోనని ఆందోళన—

మంజువాణి తనను నిరాకరించి, పరపురుషుడిని చేబట్టుతుందేమోనన్న ఆవేదన—

ఒకరి ఆతురత మరొకరికి నిర్లక్ష్యం.

ఒకరి ఆందోళన మరొకరికి అవహేళన.

ఒకరి ఆవేదన మరొకరికి ఆహ్లాదం.

మంజువాణి ప్రవర్తన సరిగా అలాగేవుంది.

'మరి ఏమంటావు? మనిద్దరం పెళ్ళిచేసుకుందామా? నీకు ఇష్టమేనా?' సిగ్గుని చంపుకొని, అభిమానాన్ని అవతలకు నెట్టి నోరు తెరచి మరొకసారి అడిగాడు మదనుడు.

మదనుడు విద్యావంతుడు, ధనవంతుడు, అందగాడు, నవనీతంవంటి హృదయం వుంది. ఏలోటూ లేదు.

మంజువాణికి విద్యలేదు, ధనం అసలే లేదు. సంస్కార వరురాలని అనుకొనడానికి అంతగా వీలులేదు. ఉన్నదల్లా కమ్మెచ్చున తీసినట్టు కన్పించే అంగసౌష్టవం! అంతే.

మదనుడికి సరిగా అదే కావాలి. మగవాడి దుర్బలత్వం కనిపెట్టిన జవరాళ్ళు, కాళ్ళదగ్గర కొచ్చినవాళ్ళను కీలుబొమ్మలను చేసేస్తారు.

మదనుడి ప్రశ్నకు జవాబు చెప్పాలన్న దృష్టి మంజువాణికిలేదు. నిర్లక్ష్యంగా వయ్యారం వలకబోస్తూ, 'నన్ను చూడు, నా అదంచూడు' అన్నట్టు అటూ ఇటూ పచార్లు చేయసాగింది.

నిజంగా ఆమె నడకలోనే ఎంతో శోభ మదనుడికి గోచరించింది. అదిచూస్తూ తన్మయుడై పోతున్నాడు. తనివి తీరడంలేదు.

మంజువాణికి అకస్మాత్తుగా మదిలో ఏదో భావం మెరిసింది. ఆమె ముఖంలో అదే వ్యక్తమైంది.

లేడిపిల్లవలె గంతులేస్తూ లోపలకువెళ్ళి రెండు గ్లాసులతో ఏదో పానీయం తెచ్చి, కఠటి మదన్‌మోహన్ చేతి

కందించబోయింది. మదనుడు కొద్దిగా మారాము చేశాడు. విధిలేక ఆమె గ్లాసును అతని పెదాలకు అందించింది.

సన్నని ఆమె నడుముచుట్టూ మదన్ తన చేతినిపోనిచ్చి తనవైపు లాక్కున్నాడు. వలపు ఒలికిస్తూ అతి వయ్యారంగా ఆమె సోఫాలో మదన్ ప్రక్కనే వాలిపోయింది. ఇద్దరూ పానీయం పానంచేయటం పూర్తిచేశారు.

మదన్ రెప్పవాల్చకుండా మంజువాణివంక తదేకంగా చూస్తున్నాడు.

"చూపులతోనే నన్ను కొరుక్కుతింటున్నావే?"

"మొదటినాటిరాత్రి జ్ఞాపకం వుందా? ముతకచీర. ఎర్రచీర కట్టుకొన్నావు. నిజంగా నా కంటికి అప్సరలాగ కన్పించావు"

"గతాన్ని గుర్తుచేయక మదన్! నీకుపుణ్యముంటుంది. పాపిష్టి జీవితం; పాడు బ్రతుకు అలాంటిది. పగవారికికూడ వద్దు" మంజువాణి కనులలో నిర్వేదం ద్యోతకమైంది.

"అప్పటికి ఇప్పటికి ఎంత తేడా? ఆనాడు నీవొక పల్లెటూరి యువతివి. నాగరికత, సంస్కారం ఎరుగని అమాయకురాలవు. కాని, ఈనాడో...

"ఏం, నానెత్తిన పొద్దుపొడిచిందా? నాడులేని అందచందాలు ఈనాడు నా మేనున పుష్పించాయా? ఏమిటో ఆ తేడా?" చిరునవ్వు ఆమె గులాబీరంగు బుగ్గలపై నర్తించింది. చిలిపితనం ఆమె చూపులో వ్యక్తమైంది.

"నీవు ఎన్నెన్నో విద్యలు నేర్చిన విదుషీమణివి ఇప్పుడు. ఎదటివ్యక్తిని ఇట్టే పట్టికొట్టించగల సామర్థ్యం

సంపాదించావు. వలపులవర్షం కురిపించి, పురుషులను మరి పించగలిగిన చాతుర్యం సంపాదించావు. నటనలో, హావభావ ప్రకటనలో మహానటీమణులను మించిపోగల దిట్టవు."

"ఏదో ఇదంతా మీరు కట్టుకున్న పుణ్యం"

"అందుకే నన్ను కట్టుకోమంటున్నాను." అంటూ మదన్ ఆమెను బలవంతాన ముద్దుపెట్టుకోబోయాడు.

మంజువాణి నేర్పుగా, బంధనంనుంచి విముక్తయై ఎదుటి సోఫాలో ఆసీనురాలైంది.

"నా గతం ఎలాంటిదో తెలుసుకోనే, మీరు ఈ ప్రతిపాదన చేస్తున్నారా?"

"తెలుసు. విలోప్తమైంది గతం. జ్వలిస్తున్నది వర్త మానం. ప్రదీప్తం కావలసింది భవిష్యత్తు"

"ఆవేశం అవహించి, ఆలోచన మందగించి అవ్యక్తా లాపన చేస్తున్నారు గతంలోనుంచే వర్తమానం వర్తమానం నుంచే భవిష్యత్తు-పూసలలో దారంలాగా అవిచ్ఛిన్నంగా వుంటుంది. గతాన్ని విడిచేసుకోవటం ఎవరికి సాధ్యంకాని విషయం"

"ఆ మాట నేనెన్నటికి అంగీకరించలేను. పొరపు అన్నది ప్రతిప్రాణికి సహజం. నీవు అందుకు అతీతురాలివేమి కాదు. పరిస్థితులనుబట్టే ప్రవర్తన. పరిస్థితులు మారితే ప్రవర్తన మారుతుంది. ఇదే నా విశ్వాసం"

మంజువాణి క్షణంసేపు ఆలోచించింది.

"అశ మా విశ్వాసానికి శ్వాస. అశ అవాస్తవంకనుక మా విశ్వాసం అవాస్తవము"

"గతంలో నీ పతనానికి కారణం దారిద్ర్యం, కష్టాలు కాదంటావా?"

"కాదనను. అయితే ఈ లోకంలో ఎంద రెందరు ఎన్నెన్ని కష్టాలు అనుభవించడంలేదు? మరెంతటి కటిక దారిద్ర్యాన్ని భరించటంలేదు? వారందరూ నావలెనే పతిత జీవులై పోయారా?"

"దేనికైనా సాహసం కావాలి. అలాంటి సాహసం బహుశా వారికి లేకపోవచ్చు, నీవలెనే వారూ సుఖమయ జీవితాన్ని ఆశించివుంటారు. అయితే అందుకు ముందడుగు వేయటానికి జంకిఉన్న మురికికూపంలోనే కాలక్షేపం చేస్తూండవచ్చు. అంతే తేడా"

మంజువాణి సంతృప్తిగా నవ్వింది. తెల్లని పలువరుస ఆమె ముఖానికి మరింత అందం తెచ్చిపెట్టినట్టయింది.

"అయితే మీరు ఆవిధంగా నా పతనాన్ని సమర్థిస్తు న్నారన్నమాట. సంతోషం! అయినా స్వేచ్ఛావర్తనులమైన మనిద్దరికి పెళ్ళేమిటి? ఇనుప పంజరంనుంచి బయలుపడిన నేను మళ్ళీ బంగారు పంజరంలో బందీని కావాలా? అసాధ్యం! ఏరాయి అయితేనేమి పళ్ళూడగొట్టుకోవటానికి? బంగారు రాయి అయితే బాధతగ్గి, హాయిగా వుంటుందా? లేదు ముమ్మాటికీ. లేదు పెళ్ళి చేసుకున్నప్పటికీ, నాతల్లి స్వతంత్ర వర్తనురాలు కాగలిందా? నాతండ్రి ఎంత మంచివాడైతే మాత్రం ఆత్మహత్య చేసుకొనేవరకు ఆమె ఊపిరి సల్ప నిచ్చిందా? వివాహ బంధనమే లేకపోతే అలాంటి దుర్గతి

నా తండ్రికి పట్టేదేకాదుగదా? మంచిగా బ్రతకటానికి ప్రయత్నిస్తే నేను ఈపాటికి ఎక్కడ వుండవలసి వచ్చేదో?"

తన మంజువాణి ఇలా మాట్లాడుతుందని మదన మోహన్ ఊహించలేదు. అందుకే అతనికి కొంత నిరుత్సాహం కలిగింది. తాను పెళ్ళిచేసుకొంటానని అనగానే, మంజు ఎగిరి గంతేసి 'సై' అంటుందని ఆశించాడు. అతని ఆ ఆశకు ఇప్పుడు పెద్ద దెబ్బతగిలింది. లాలిస్తే దారికి రాకపోతే, బెదిరించి లొంగదీసుకోవాలన్న నీతిని ఆచరించితే మంచిదన్న అభిప్రాయంతో మదన్ ధోరణి మార్చాడు.

"వయసుతోపాటే నీ సొగసూ తగ్గిపోతుందన్న విషయం గుర్తుంచుకో. నీది చంద్రుని బ్రతుకు వంటిది. సూర్యుని స్వర్ణకాంతితో చంద్రుడు వెలుగుతున్నాడు. పరుల స్వర్ణంతో నీవూ వెలుగున్నావు. మరచిపోకు."

మంజువాణి అహం దెబ్బతిన్నది. కోపం ఆవేశించింది. కోమలాంగికి కోపంకూడ అదొక రకమైన అందమే తెచ్చిపెడుతుంది. తోకత్రొక్కిన తాచులాగా ఖస్సుమన్న మంజువాణి మదనుడికి మరింత ముచ్చటగా గోచరించింది.

"బెదిరిస్తే నేను అదరిపోను. నా నిబ్బరం చెదిరిపోదు. కేవలం సౌందర్యాన్ని అమ్ముకొని, బ్రతకవలసిన దుర్గతిలో నేనిప్పుడు లేను. ఒకప్పుడు నా పరిస్థితి అదే కావచ్చు. కాని, నేనిప్పుడు ఉద్యోగంకూడా చేస్తున్నాను ఇకనుంచి చేస్తాను.

"పొరబడుతున్నావు మంజూ! పొరబడుతున్నావు. స్వతః శక్తివల్ల నీకు ఉద్యోగం రాలేదు. నా అనుగ్రహం పోయిన మరుక్షణంలో ఆ ఉద్యోగమూ ఊడుతుంది. నీవు

బజారుపాలు కాకతప్పదు. బజారులో తిరుగుతున్న నిన్ను చేరదీసి, ఒక మనిషిగా చేశాను. ఇది కాదనలేని సత్యం. ఏమంటావు?"

"ఈ ఉద్యోగం పోతే మరొక ఉద్యోగం! ఈ విశాల ప్రపంచంలో సవాలక్ష ఉద్యోగాలు! సుందరాంగులకు సాధ్యం కానిదేదీ లేదీ ప్రపంచంలో. ఇది ఎవరూ కాదనలేని చిర సత్యం. ఇందుకు నేనూ, నీవే నిదర్శనం"

మంజువాణి మాటలుకూడా నేర్చింది. వగలాడి మాత్రమే కాదు. మాటకారికూడా. ఇక లాభం లేదనుకొన్నాడు మదనుడు.

"సరే నీకు మరీ మరీ చెప్పి లాభంలేదు. నీఇష్టం. నాదొకటే చిన్న విన్నపం. వివాహంకాని స్త్రీ ఎంత ధనికురాలైనా, మరెంత తెలివిగలదైనా ఈ సంఘంలో విలువలేదు. అవసరం తీరేవరకు ముఖం ఎదుట నిన్ను మెచ్చుకొన్న పురుషులే, చాటున నిన్ను ఉతికి ఎండవేస్తారు. నేను ఇంతగా ఎందుకు చెబుతున్నానో నీవు ఆలోచించుకో.

"ఆలోచించవలసిన అగత్యమేముంది? తేలికగా అర్థమౌతూనేవుంది. స్వార్థంకోసమే నీవు ఇంతగా ప్రాధేయపడుతున్నావు. పరులు నన్ను అనుభవించకూడదు. నా సౌందర్యాన్ని నీవే గుత్తకు తీసుకోవాలి."

"అందుకే తాళి అనే తాడుతో నన్ను బంధించాలనుకొంటున్నావు."

"నిజమే. నా సుఖంకోసం, నా ఆనందంకోసం, నిన్ను నాదానిగా చేసుకోవా లనుకుంటున్నాను. నాతోపాటు నీవూ సుఖంగా బ్రతకవచ్చు. మనిద్దరి జీవితాలకు సార్థక్యం చేకూర్చడమే నా అభిమతం. మాన మర్యాదలతో జీవిద్దాం."

మంజువాణి అవహేళన పూర్వకంగా నవ్వింది.

"మంచి, మప్పితం, మాన—మర్యాదలను గురించి నేటికివిన్నాను నీ నోటినుంచి. ఇక ఏదో ఉప్పలాయి తప్పదు."

"సరే నీ యిష్టం" అంటూ మదనుడు సోఫాలో జారగిల బడ్డాడు.

---

# 4

"ఎక్కడికి వెళ్ళేది!"

"అదే నిన్నడగవద్దన్నాను. నేను ఎక్కడికి వెళ్ళేదీ నీకు చెప్పాలా?"

"నాకేమీ చెప్పనవసరములేదు. మామగారి పరిస్థితి యేమీ బాగుండలేదు. ఈరోజు ఏక్షణాన్న ఏమవుతుందో తెలియును."

"ఆయనకు ఏమీకాదులే. నివేమీ భయపడ నవసరం లేదు. డాక్టరుగారిని వచ్చి చూడమని చెప్తాతాను."

"ఆ శ్రమ మీ కేమీ అక్కరలేదు. ఆయనను వచ్చి ఈ దినమంతా యిక్కడే వుండమని యిదివరకే కోరాను."

"అయితే యింకేం"

"మీ అమ్మ మిమ్ములను పిలుస్తున్నది."

"మీ అత్తా కోడలి తంతు రోజూ ఎరిగినదేగా! నన్ను వెళ్ళనివ్వద్దని పాఠము నేర్పించివుంటావు."

"అత్తకు పాఠాలు నేర్పితేనా కేమిలాభము! మీరింట్లో వుండి మాత్రము ఏమిచేస్తారు గనుక! ఆ చీట్లపేకముందు కూర్చుంటే శంఖము వూదినా వినబడదామె."

"ఎప్పుడూ ఈ సనుగుడుతో మనిషిని చంపుకు తింటున్నావు."

"అంతబాధ ఎందుకు! వెళ్ళదలచుకున్న చోటికి వెళ్ళండి మామగారి కేదైనా అయితే అప్పుడు మీరే బాధ్యులు."

"నిన్నేమీ బాధ్యత వహించమని నేనేమీ కోరటం లేదు." అని అనుస్తూ తలవాకిలి తలుపు విసురుగా తీసుకొని 'ఢాం' అని మ్రోగేటట్లు తుఫానులాగా వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

ఈ రంగానికి అలవాటైన మనోరమ మిషను ఆపనూ లేదు. కుట్టు ఆగనూలేదు. కాలు త్రొక్కుతూనేవున్నది. పైటచెంగుతో కళ్ళు తుడుచుకున్నది.

అవతల హాలులో మామగారివద్ద కూర్చుని వింటున్న డాక్టరుగారు మెల్లగా వసారాలో మిషనుకుట్టుకొనుచున్న మనోరమ వద్దకు వచ్చి చాలా మెల్లగా యిలా అన్నాడు.

"మనోరమగారూ! మీ మామగారి ప్రాణాలు యిక క్షణాలలో వున్నవి. అత్తగారివద్ద వచ్చివుండండి. ఆమెకు ఏలాంటి విపత్తు వస్తుందో చెప్పలేను. యిప్పటికే ఆమె స్పృహలేనిదానివలె వున్నది."

"ఇదిగో వస్తున్నాను డాక్టరుగారు! నన్ను అక్కడ వుండవద్దన్నారని వచ్చేశాను."

"నిన్నుచూస్తే నీమామగారి దుఃఖము అధికమై ప్రాణాలు యింకా తొందరగా వదలుతారని వెళ్ళిపొమ్మన్నాను. ఇక లాభములేదు. ఈ ప్రపంచములో చేయతగ్గవన్నీ చేసిచూశాను."

"యిద్దరూ హడావిడిగా లోపలకు వెళ్ళారు. వెళ్ళిన కొంచంసేపటికి మామగారు హరీ అని ప్రాణం విడిచారు. అత్తగారు కోడలు గొల్లుమన్నారు-డాక్టరుగారు యిద్దరకు వూరట మాటలు చెప్పారు.

"అశ్బాయేడీ" అని అత్తగారు విలపించారు.

"ఇదిగో, మదనుని ఇప్పుడే తీసుకువస్తాను" అని డాక్టరు గారు తన సంచి వగైరాలు వదలి వెళ్ళారు. ఉదయము వెళ్ళిన డాక్టరుగారు మళ్ళీ మధ్యరాత్రికరకు రాలేదు. పిల్లలని నిద్రబుచ్చుతున్న మనోరమ డాక్టరుగారిని చూచి

"ఆయన కనబడ లేదా" అని అడిగింది.

"లేదని" మెల్లగా అన్నాడు.

"మదన్" అంటూ తల్లి ఒక వెర్రికేక వేసి క్రింద బడింది, ఆ కేక వినబడే వచ్చినటు మదనమోహన్ లోపలికి వచ్చాడు. కళ్ళు ఎర్రగా వున్నవి. మనిషి తూలటములేదు. గాని నిలువునా నుంచోలేకపోయాడు. తండ్రిమంచముమీద కూలబడ్డాడు. కుప్పవలె కూలిన తల్లిని సరిగా నేలమీద పరుండబెట్టాడు. పెదవి కొరిచాడు. మనోరమ మళ్ళీ గొల్లు మన్నది తెల్లవారి పురప్రచారమునకు వెళ్ళకుండా మదన్ మోహన్‌గారు తల్లిదండ్రులకిద్దరికి అంత్యక్రియలుచేశాడు. అంతటితో ఇంటికి దండధర ప్రభువయ్యాడు. ఏమి, ఎందుకు అని సాహసించి అడిగేవాళ్ళు లేరు.

---

# 5

ఇద్దరూ మంచి యవ్వనంలో వున్నారు. లోకం యేమనుకొన్నా వారికి లెక్కలేదు. నీతి నియమాలు అక్కర లేదు. విలాసాలు, భోగాలు వుంటే చాలు.

శ్రమించి, జీవించడం వారెరుగని విషయాలలో ఒకటి. ఒకరికిమించి, మరొకరు అబద్ధాలాడడంలో నేర్పరులు. యే మాట హృదయాంతరాళంనుంచి వస్తున్నదో, ఏది పెదాల చివరనుంచి ఊడిపడుతున్నదో కనిపెట్టడం కష్టం.

మంజువాణి పుట్టింది పల్లెటూరులోనే. అయినా, రక రకాల జీవితం అనుభవించిన తల్లివద్ద పెరిగింది. పురుషులను వశీభూతం చేసుకోవడ మెలాగో ఆమెకు ఉగ్గుపాలతో రంగ రించినవిద్య. కనుకనే ఆటే చదువు సంధ్యలు లేకపోయినా, మహా పట్నానికి ఒంటరిగా వచ్చి నిభాయించుకు రాగల్గింది.

మంజువాణి, మదన్ - ఇద్దరూ సోఫాలలో కూర్చుని మాటలు కట్టిపెట్టి, అంతర్ముఖులై పోయారు. ఎవరిధోరణిలో వారు లోలోపల గుణించుకొంటున్నారు.

మంజువాణిని బుట్టలో వేయడం ఎట్లా?- ఇదీ మదన్ ముందున్న తక్షణ కర్తవ్యం.

మదన్‌మోహన్ సృష్టించిన విషమ పరిస్థితినుంచి, బయట పడడమెలా? మదన్‌తో తన సంబంధాలు చెడిపో కూడదు. అతని మనస్సు నొప్పించకుండా తప్పించుకొనే మార్గమేమిటి? ఇదీ మంజువాణికి ప్రత్యక్షమైన క్లిష్టసమస్య.

"మీరు గృహస్థులు. మీ దాంపత్య జీవితాన్ని పాడు చేయడం నాకు భావ్యం కాదు" అంది మంజువాణి నెమ్మదిగా.

"నీవు ఏనాడైతే నా కంట పడ్డావో, ఆనాడే నా దాంపత్య జీవితం పాడైపోయింది. ఇంకా చెడిపోవడానికి మిగిలిందేమీ లేదు. నీవు నా మాట కాదంటే, చెడిపోయేదల్లా నేను. నా హృదయంలో పొదుగుకుంటున్న మధుర స్వప్నాలు. కరుణించి నా కలలు కల్లలు చేయకు" అని ప్రార్థనా పూర్వకంగా వేడుకొన్నాడు మదన్.

"సరే, మీరు ఇంతగా కోరుతున్నప్పుడు నేను కాదనటం మంచిది కాదు. నా హృదయాన్ని మీకు ఏనాడో అర్పించి వేశాను. అయితే పెళ్ళి అనేసరికి ఎందుకనో నాకు మహా భయంగా వుంది. నా జాతకం చూచిన జ్యోతిష్యులంతా నాకు వివాహ యోగం లేదనే చెప్పారు. ఒకవేళ పెళ్ళి అయినా, మూడుముళ్ళుపడ్డ ఆర్నెల్లకు నన్ను కట్టుకున్నవారు హరీ అనక తప్పదట. అందుకే పెళ్ళంటే నేనంతగా హడలిపోతున్నాను. మీ మీద వున్న ప్రేమవల్లనే, కలకాలం మీరు నావారుగా వుండాలన్న కోర్కె కొద్దీ మీ కోర్కె అంగీకరించలేక పోతున్నాను."

మంజువాణి వేసిన కొత్త మెలికలోని కిటుకును పసికట్టలేనంత దద్దమ్మ కాదు మదన్.

"నాకు జ్యోస్యాలంటే ఈషణ్మాత్రం నమ్మకం లేదు. పైగా నా జన్మ నక్షత్రాన్ని బట్టి నేను కనీసం తొంభై సంవత్సరాలు నిక్షేపంగా బ్రతుకుతానని జ్యోతిష్యంలో

ఉద్దండులైనవారే చెప్పారు. కనుక నా ప్రాణాన్ని గురించి నీవు భయపడవలసిన పనిలేదు."

మంజువాణి నెమ్మదిగావచ్చి మదన్ పక్కనే కూర్చున్నది. ప్రేమకొద్దీ అతని తల నిమురుతూ, తన చేతి వేళ్ళను అతని జుత్తులోకి చొప్పిస్తూ, తన మెత్తని బుగ్గలను అతని బుగ్గలకు నిమురుతూ——

"ఏమండీ ఇప్పుడు మీకువచ్చిన లోపమేమిటి చెప్పండి? మీరు ఏ క్షణాన కావాలనుకొంటే ఆ క్షణాన నా దగ్గరకు రావచ్చే! నేను ఎప్పుడైనా మీకు అభ్యంతరం చెప్పానా? అర్ధరాత్రివేళ వచ్చినా, సంతోషంతో స్వాగత మివ్వలేదా? మరి ఈ పెళ్ళి ప్రతిపాదనమా ఎందుకు పట్టుకొచ్చినట్టు? మీరు నన్ను నమ్మలేకపోతున్నారు. అంతేగా!"

"నీవు నా సహధర్మచారిణివి కావాలి. అది నా అభీష్టం."

"మరి నా అభీష్టం సంగతేమిటి?"

"నా అభీష్టమే ని అభీష్టం కావాలి"

"అంత నిర్బంధం తగునా?"

"ఈ హక్కును నేను సంపాదించుకొన్నాను" అంటూ మదన్ ఆమె బుగ్గమీద చిన్న చిటికె వేశాడు.

"నాదొకటే కోర్కె"

"ఏమిటో చెప్పు?"

"ఆలోచించుకోడానికి రెండు మూడు రోజులు వ్యవధి ఇవ్వండి."

"రెండు మూడు రోజులుకాదు, వారం రోజులు తీసుకో. కావాలంటే ఢిల్లీ వెళ్ళు. అక్కడ ప్రశాంతంగా ఆలోచించుకో.

"సరే అలాగే చేస్తాను."

"అన్నట్టు నరనారీని కేతన్‌జికగ్నిషన్ విషయంకూడా తేల్చుకురావచ్చు. తప్పకుండా ఢిల్లీకే వెళ్ళు పనిలో పని. మంచి ఐడియా, నీ ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ వెంటనే చేస్తాను. ఏదీ కమ్మటి ముద్దొకటి యిటు పారేయ్."

"పోదురూ! ఇన్నేళ్ళువచ్చినా పసితనం పోలేదు. వేళా పాళా లేదు. ఎప్పుడుపడితే అప్పుడు సరసాలు సాగించడానికి ఇది సానికొంపా? పైగా ఇకముందు మీతో సంసారం చేయవలసినదానిని! సంసారిలాగా ఇప్పటినుంచి అయినా అలవాటు చేసుకోనివ్వండి."

మదన్‌మోహన్ మంజువాణి మాటలకు విరగబడి నవ్వాడు. మంజువాణి కిలకిలా నవ్వింది.

"రేపు జి. టి. కే నీ ప్రయాణం. అన్నీ సర్దుకొని సిద్ధంగా ఉండు" అని మదన్ బయలుదేరాడు.

మంజువాణి అతనిని వాకిటివరకు సాగనంపి, సెలవు తీసుకొంది.

"అమ్మయ్య, నేటికి గండం తప్పింది" అని ఆమె నిట్టూర్చింది.

ఆమెకు తెలియకుండా చేయవలసిన పనులు చేయించాడు.

# 6

రైలుబండి హఠాత్తుగా ఆగిపోయింది.

మంజువాణి ఉలిక్కిపడి లేచింది. గుండె గుభేలుమన్నది. కన్ను పొడుచుకున్నా కానరాని కారుచీకటి. రైలు ఆగిపోయినా, ఆమె గుండెల్లోమాత్రం రైళ్ళు పరుగెడుతూనే వున్నాయి.

కర్మం చాలక ప్రమాదం జరుగలేదుగదా? బండి పట్టాలు తప్పలేదుగదా? తన భయానికి తనలో తానే నవ్వుకొంది మంజు. అంత ప్రమాదమే జరిగితే, పెట్టెలో తాను చెక్కుచెదరకుండా ఎలా వుండగలుగుతుంది?

ఏమో, ఏదైనా బ్రిడ్జిమీదనుంచి బాడి నదిలో పడిపోకూడదా? తనపెట్టె నదిపై తేలియాడుతూ వుండవచ్చుగదా? కిటికీతీసి చూద్దామా అంటే, నీరు లోపలకువచ్చి పెట్టె ఎక్కడ మునిగిపోతుందోననే భయం పట్టుకు పీడిస్తున్నది.

అసలు తను మద్రాసునుంచి ఎందుకు ప్రయాణమైనట్టు? ఇక్కడ తాను చచ్చిపోతే...అమ్మబాబో, నరకానికి పోక తప్పదు. చేసినవన్నీ పాపాలేనాయె! ఆరి భగవంతుడా, చేసిన తప్పులకు క్షమించి ఆపదనుంచి కాపాడు. యేడుకొండల వెంకటేశ్వరా, ఆదుకో. బ్రతికి బాగుంటే నీకు నిలువుదోపిడీ యిస్తా...ఇలా ఆపద మొక్కులు మొక్కుకుంటోంది మంజు.

భగవంతుడైనా, మరొకడైనా కష్టాలలో, ఆపదలలో వున్నప్పుడే ఎవరికైనా గుర్తుకొస్తారు. అది మానవ సహజం.

అసలు ఆపదలో గుండె నిబ్బరం నిలుపుకోవడానికి దేవుడనే వాడు సృష్టి అయ్యాడా అనిపిస్తుంది.

అయినా తాను హాయిగా, ఆ మదనమోహనుడు చెప్పినట్లు పెళ్ళికి అంగీకరిస్తే ఈ తిప్పలుండేవి కాదుకదా? తైతక్కలాడుతూ ఢిల్లీకి ఒంటరిగా బయలుదేరడ మేమిటి? తనకు తగినశాస్తే జరుగుతున్నది,

తాను ఎంత అదృష్టవంతురాలు కాకపోతే మదనుడు అంత ఉత్తముడు తనకుతానై తనను పెళ్ళిచేసుకొనడానికి ముందుకు వస్తాడు? చేతికందిన అదృష్టాన్ని కాలదన్నిన అవివేకి తాను. కాకపోతే ఇలా జరుగుతుందా? కోరి మరీ చావు తెచ్చుకొన్నట్టయిందిగదా?

అయినా తన కేమిటి? వివాహ మేమిటి? అది ఇలలోకల; కల్ల. అసలు మదనుడు పైకి కన్పించేటంతటి ఉత్తముడుకాడు. ఆ మాటకొస్తే ప్రతిపురుషుడు అంతే, పురుషునిస్వార్థాన్ని, కామ తృష్ణను తీర్చగలిగిన అతివ ఈ అవనిలోవుందా?

మదనుడి కామ తృష్ణను తీర్చడం తనకు సాధ్యమా? తనొక్కదానితో తృప్తిచెంది, అతను వుండగలడా? అసంభవం? తనకుమాత్రం స్వార్థం, అహంభావం ఏమంత తక్కువ వున్నాయని?

రకరకాల విటులను ఎంతమందినో చూచాను. కాని మదనునివంటి వానిని యిదివరకు చూడలేదు. నిక్షేపము లాంటి భార్యను, రత్నాలలాంటి బిడ్డలను వదలి యింటికేల వస్తున్నాడు? కాని తనతో తృప్తిపడుతుంటేగా! మొన్న శమంతకమణి యింటినుండి మిట్టమధ్యాహ్నము బయటకు

వస్తూవుంటే మదనుని తనే చూచింది. ఇక్కడవలె యింకా ఎంతమంది యిళ్ళచుట్టూ తిరుగుతున్నాడో! అయినా అంత మందిని అనుభవించినూడా తననే కోరటము తనవిశేషమే. కాని తనని పెళ్ళిచేసుకున్న తరువాత యింకోదాని వలలో తగులొక్కంటే తన గతేమిటి?

అయినా ఈ మగవాళ్ళకు బుద్ధిలేదు. తృప్తి అసలే లేదు. భార్యలతోనే తృప్తి పొందుతుంటే తనలాంటివాళ్ళ గతి ఏమయ్యేది?

వయస్సులోనే మనస్సుకు తృప్తిగా, యౌవ్వనంలోనే జామ్మంటూ హాయిగా జీవించాలి. జల్సాగా తిరగవలసిన తరుణంలో తాళిబొట్టు అనే ఉరిత్రాడు మెడకు తగిలించుకో నడమేమిటి? ఏదో నలభై యేళ్ళు నిండిన తర్వాత, 'గంతకు తగిన బొంత' దొరక్కపోతుందా? లోకం అంత గొడ్డు పోయిందా? అంగసౌష్టవంలో ఆకర్షణ తగ్గకుండా చూచుకో వాలిగాని, 'సైగచేస్తే సై' అంటూ కాళ్ళమీదవాలే శృంగార పురుషులు వుండకపోతారా? కాస్త స్థితిపరుడిని చూసి ముడేసుకుంటే. ముసలితనంలో తిప్పలు లేకుండా తప్పించు కోవచ్చుగదా?

—మంజువాణి కళ్ళుమూసుకొని పడుకొని ఈవిధంగా మంచి చెడ్డలు, లాభనష్టాలు బేరీజువేసుకొంటూ, క్షణాలను లెక్క పెడుతూ, కాలక్షేపం చేస్తున్నది. గుండెదడ తగ్గలేదు. బ్రతికి బయటపడగలనన్న నమ్మకం ఆమెకు పూర్తిగా ఏర్పడలేదు. ఆమె మగతనిద్ర పోతున్నది.

"దర్వాజా ఖోలో, దర్వాజా ఖోలో." అని అనుస్తూ ఎవరో బయట తలుపు గట్టిగా తడుతున్నారు. మంజువాణి గుండెలు మరింత జారిపోయాయి.

ఆమె నిద్రమత్తును వదిలించుకొని బెడ్డుపైనుంచి నెమ్మదిగా లేచింది.

"ఖోలో, ఖోలో"

మళ్ళీ అవే అరుపులు; అవే కేకలు.

"పశువులు, మంచీ మర్యాదా లేదు" అని తనలోనే తాను గొణుగుకుంది మంజువాణి.

ఆమె తూలుతూ లైలుపెట్టి తలుపుదగ్గరకొచ్చి, "ఎవరూ?" అని గద్దిస్తూ ప్రశ్నించింది.

"ముందు తలుపు తెరువు"

విధిలేక ఆమె తలుపు తెరిచింది.

కళ్ళు జిగేల్ మనే టార్చిలైట్ కాంతి పుంజాలు ఆమె వదనాన్ని దేదీప్యమానం చేశాయి.

"ఠీక్ హై" అన్నాడు ఆ వ్యక్తి.

మంజువాణికి అందులోని అర్థం బోధపడలేదు.

"నీవు అంటున్నదేమిటి?" అనే ప్రశ్నార్థకాన్ని ఆమె హావ, భావ ప్రకటనద్వారా వ్యక్తం చేసింది.

"ఓకే," అన్నాడు గార్డుదుస్తులలోవున్న ఆపెద్దమనిషి.

గార్డు అని తెలుసుకున్న పిమ్మట మంజువాణి మనసు కుదుటపడింది.

"ఇదేమిటి, ఈ అడవిలో రైలు ఆగిపోయింది? ప్రమాదమేమైనా జరుగలేదుగదా?" అని వచ్చీరాని ఇంగ్లీషులో ప్రశ్నించింది.

"వర్షాలవల్ల రైలుమార్గం కొద్దిగా దెబ్బతిన్నది. పెద్ద ప్రమాదం యేమీ జరగలేదు. మరి కొంతసేపటికిగాని, బండి బయలు దేరకపోవచ్చు. జాగ్రత్తగా తలుపువేసుకొని, పడుకోండి" అని గార్డు చెప్పి వెళ్ళిపోయాడు.

"అయ్యో, రామచంద్రా. ఈ నట్టడవిలో ఎంతసేపు వనవాసం చేయాలోగదా! అసలే మూడురోజులు ప్రయాణం. దానికితోడు ఈ ఆలస్యం. ఎన్నితిప్పలువచ్చి పడ్డాయి" అని తలపోస్తూ ఆ తరుణీమణి ద్వారంలోనే నిలబడి, నిశీథంలోకి నిరాసక్తంగా చూస్తున్నది.

"భయమేల భామా? నేనున్నానుగా?" అంటూ ఎవరో అపరిచిత వ్యక్తి, గబగబా పెట్టెలో ప్రవేశించాడు.

"ఎవరు మీరు? ఏమిటీ అఘాయిత్యం? ఇది రిజర్వుడు కంపార్టుమెంటు. ఒంటరిగావున్న ఆడదాని పెట్టెలోకి మీరు రావడానికి వీలులేదు" సడలిపోతున్న ధైర్యాన్ని చిక్కబట్టుకొంటూ దబాయించ జూసింది మంజువాణి.

"ఒంటరిగా వున్నావని తెలిసే నేను వచ్చాను. జంటగావుంటే ఒంటరితనం ఉండదుగా"

"పిచ్చివేషాలు కట్టిపెట్టి, ముందు బయటకు నడవండి. మర్యాదగా మాట వినకపోతే గార్డును పిలిచి అరెస్టు చేయిస్తాను."

"మొదటి విషయం: మనిద్దరం మంచికీ, మర్యాదకు ఏనాడో తిలోదకాలిచ్చినవాళ్ళం. రెండవ విషయం: నీ ఆర్త నాదం ఆలకించి, ఆదుకొనే నాథులు ఇక్కడిప్పుడు లేరు. అన్నీ కట్టుదిట్టాలు చేసుకొనే నేను ఈ పెట్టెలోకి వచ్చాను."

పెద్ద చిక్కే వచ్చిపడింది. ఏమిటి గత్యంతరం? క్షణం సేపు ఆలోచించింది మంజువాణి. ఎలాంటి పరిస్థితులలోనైనా తెలివిగా మెలగడం ఆమెకు అనుభవంద్వారా అబ్బిన విద్య. ధోరణి మార్చాలి – కొత్తవ్యక్తిని దారికి తేవాలి. మంచి మాటలద్వారా సాధించలేనిదానిని మోసంచేసి నెరవేర్చుకోవచ్చు.

"వచ్చినవారు ఎలాగూ రానేవచ్చారు. గడియవేసి వచ్చి అలా దూరంగా కూర్చోండి" అని మంజువాణి ఆహ్వానించడంతో పురుషపుంగవుడు 'చూసుకో నాదెబ్బ' అనే ధోరణిలో మీసం మెలివేశాడు; జరగబోతున్న మోసం సంగతి తెలుసుకోలేక.

పురుషుని దర్పం, కోమలాంగికి కూబితనం–ఇవే వారి ప్రధాన లక్షణాలు.

ముక్కు మొఖం ఎరుగకపోయినా చొరవచేసుకొని, పెట్టె ప్రవేశం చేసిన ఆ కొత్తవ్యక్తి సిగరెట్టు కాల్చడానికి

వెలిగించిన అగ్గిపుల్ల వెలుగులో వారిద్దరు ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు.

మంజువాణి ముఖారవిందం చూచి, కొత్త వ్యక్తి ముగ్ధుడైపోయాడు. "ఫరవాలేదు. వీడితో వేగడం అంతకష్టం కాదులే" అని మనసులోనే అనుకొని గుండె దిటవుపర్చు కొంది ఆ నారీరత్నం.

"ఎందాక ప్రయాణం? ఢిల్లీకేనా?"

"ఏం? మీరూ ఢిల్లీవస్తున్నారా?"

"ప్రస్తుతం రావడంలేదు. తొందర పనివుంది. అది ముగించుకొన్న తరువాత వస్తాను."

"బ్రతికించారు" అని అప్రయత్నంగా అనేసింది మంజువాణి.

"నిన్ను తప్పకుండా బ్రతికిస్తాను. బ్రతుకు తెరువు చూపిస్తాను. మరి నా వెంట వస్తావా?"

"ఇలాంటి విషయాల్లో పురుషులు క్షణిక నిర్ణయాలకు రాగలరు. ఎందుకంటే, ఆ నిర్ణయాలవల్ల నెత్తినపడేబాధ్యత లేమైనవుంటే, అవీ క్షణికాలే కనుక. కాని స్త్రీ పరిస్థితి అదికాదే"

"మాటలు నేర్చిన మగువా!" అని ఆ వ్యక్తి మంజువాణిని సంబోధించి, వాక్యం పూర్తిచేయకుండానే ఆగిపోయాడు.

"గరమ్ చాయ్, గరమ్ చాయ్" అంటూ క్రింద కుర్రవాడు అరుస్తున్నాడు.

"వేడి వేడి టీ త్రాగితే పోలా. మీ గొంతులోనే ఆగిపోయిన అసంపూర్ణ భావం కాస్త పెగలడానికైనా వీలిస్తుంది" అని మంజువాణి కొత్త వ్యక్తితో పరిహాసమాడింది.

చలిలో వెచ్చదనం ఎంత హాయినిస్తుంది! విరహంతో కాగిపోతున్న హృదయానికి ప్రేయసి లేదా ప్రియుని వేడి వేడి ముద్దులు ఎంతటి చల్లదనం ప్రసాదిస్తాయి! ఏమిటీ వైచిత్రి! ఒకేసారి వెచ్చదనం, చల్లదనం కోరుకొనే మనస్సులు నిజంగా విచిత్రమైనవే.

---

# 7

రెస్టారెంట్ వచ్చింది కాబోలు. అంతా కోలాహలంగా వుంది.

మంజువాణి, ఆ కొత్త వ్యక్తి కలసి వేడివేడి టీ చప్పరిస్తున్నారు. చలితో ముడుచుకుపోయిన మనస్సులకు ప్రకోపన కల్గింది. చల్లదనానికి మందగించిన ఉడుకు రక్తం వారిద్దరి శరీరాలలోను తిరిగి ఉత్సాహంగ సాగింది.

లైట్లు వెలిగాయి.

ఇద్దరూ ఒకరి నొకరు పరీక్షగా చూసుకొన్నారు. గుడ్డివానికి దృష్టివస్తే సంబరపడినంతగా, వారిద్దరూ ఉబ్బిపోయారు.

"నువ్వు చాలా అందంగా వున్నావు"—మంజువాణి అందచందాలకు బందీ అయిపోయాడు ఆ కొత్తవ్యక్తి. తన్మయత్వం పొందాడు.

"ఉఁ హుఁ, అంత అందంగా వున్నానా?" ఆ బంగారు బొమ్మ హృదయంలో గర్వోన్నతి చిటారు కొమ్మకు ఎగ ప్రాకింది.

మంచి యౌవ్వనంలోవున్న ఆ అపరిచితవ్యక్తి తన సంచిలోనుంచి బిస్కట్ ప్యాకెట్ తీసి ఆమెకు అందివ్వబోయాడు. ఆ పూబోణి ముందు నిరాకరించింది.

అతను ఒక బిస్కట్ తీసి, ముందుకువంగి, గులాబీరేకులను పోలిన ఆమె పెదాలకు అందించబోయాడు. మురిసిపోతూ మూతి ముడుచుకొంది ఆమె.

"అపరిచితులదగ్గర నేనేమీ తీసుకోను"

"కొద్ది నిముషాల క్రితంవరకే మనం అపరిచితులం. చూపులు, మాటలు కలిశాక సుపరిచితులమే."

బెట్టుచేసిన అతివ వద్దంటున్న కొలకీ, నూరింత బలవంతం చేయడం పురుషుని లక్షణం. వద్దు వద్దంటున్నా వినకుండా అతను బిస్కట్‌ను ఆమె నోటిలో కుక్కాడు.

"ఏమిటీ మోటుసరసం? నీకేమన్నా మతిపోయిందా?" అంటూ ఆమె చిరుకోపం ప్రదర్శించింది.

"నీవంటి అందాలబరిణె కంటపడ్డాక ఏ పురుషుడి మతి మతిలో వుంటుందిచెప్పు? అసలు పురుషుల మతిభ్రమలకు అతివలేకదా కారణం?"

"పిచ్చి సన్యాసి!" అంటూ వెకిలిగా నవ్వింది ఆమె.

"అపరిచితయైన స్త్రీతో, అందులో అందవతియైన కాంతతో ఏకాంతంగా ముచ్చటించడం నాకు మహాసరదా"

"ఈ కాంత సంగతి నీకు తెలియదు"

"ఆడవాళ్ళు చిలిపి మాటలతో నవ్విస్తారు, చిలిపి చేష్టలతో కవ్విస్తారు, గాజుల సవ్వడితో కీరగంటి చూపులతో వలపుల వయ్యారంతో మగవాళ్ళ గుండె ఝల్లుమనిపిస్తారు?"

"ఆహా! ఏమి కవిత్వం! ఏమి వర్ణన!! ఏమి వాగ్ధాటి?"

"కవిత్వమైనా, ప్రకృతి వర్ణనలైనా, కళలైనా, సుందరాంగుల ప్రేరణతో ప్రాదుర్భావం పొందినవే."

"ఇంతకీ నీ పిచ్చికి నా అందమే కారణమంటావు?"

"నీ అందంకాదు సుందరీ; ప్రకృతి సౌందర్యంలో కావలసినంత అందం లేదా? పరిమళిస్తున్న పుష్పాలు నేత్రా

నందదాయకం కావా? అయినా వాటినిచూస్తే మతులు గతులు తప్పడంలేదే?"

అపరిచిత వ్యక్తి ఆపేక్షతో తనవంక తదేకంగా చూస్తూ తనఅందాన్ని అదేపనిగా పొగడడంతో మంజువాణిహృదయం జ్వలితమైంది. మేను పులకరించింది. దేహంలో విద్యుత్ ప్రవహించింది. కాలి బొటనవ్రేలితో క్రింద ఏవో అక్షరాలు వ్రాసివేస్తున్నది. సిగ్గుభారంతో చూపులు వాలిపోయాయి. అధరాలు కొద్దిగా అదిరాయి.

స్త్రీ స్వభావంతో బాగా పరిచయమున్న ఆ అపరిచిత వ్యక్తి మంజువాణి స్థితిని గమనించి, లాలనగా—

"ఇటువచ్చి కూర్చో, చలివేస్తున్నది" అని పిలిచాడు.

ఆ పని చేయడం ఆ అతివకు మనసులో అంగీకారమే అయినా ఎందుచేతనో కాని, ఆ క్షణంలో ఆమె సాహసం చేయలేకపోయింది.

"ఊఁ, లే. ఇక్కడ కూర్చో"–గద్దించాడుఆయువకుడు.

అనిర్వచనీయమైన తాపంతో తప్తమైపోతున్న మంజువాణికి ఆ మాటలు కోపం తెప్పించలేదు.

"ఊరుకోండి, చూస్తే ఎవరైనా నవ్విపోతారు" అంటూ ఆమె బెట్టుచేసింది.

అతను ఆమె చెయ్యిపట్టుకొని కొంచెం బలంగానేలాగి, తన ప్రక్కన కూర్చోబెట్టుకొన్నాడు. 'అబ్బా' అంటూ లేని బాధను పొందుతున్నట్టు హాయిని అనుభవిస్తూ, జారిపోయిన పమిటను, చెదరిపోయిన చీర అంచులను సర్దుకుంటూ అతని ప్రక్కనే కూర్చున్నది మంజువాణి.

"నాతో వచ్చేస్తావా?"

"ఎందుకు?"

"కలకాలం కలిసి జీవిద్దాం"

"అది నాకు అలవాటు లేదే?"

"ఎంత నంగనాచివి! మరి నీ అలవాటు యేమిటో చెప్పు?"

"మహా నీకు తెలియనట్టు అడుగుతున్నావే? సన్యాసివి కాదుగా? ఆ మాత్రం తెలియదా నీకు?"

"కామి కానివాడు మోక్షగామి కాలేడుగదా? అందుకే ముందు కామి కాదలచుకొన్నాను కామినీ..."

"భలేవారు! ఇంతకీ మీ పేరేమి? మీ దేవూరు?"

"పేరులో ఏమున్నది పెన్నిధి? త్వరలోనే నిన్ను మళ్ళీ బహుశా ఢిల్లీలో కలుసుకొంటాను"

"అలాగని మీరిప్పుడు ఎలా చెప్పగలరు?"

ఇంతలోకి రైలు కూత వేసింది.

"మరచిపోకు. మరల కలుసు కొంటాను" అంటూ అతను గబగబా పెట్టెలోనించి దిగిపోయాడు.

కూతవేసిన రైలుబండి కదిలిపోతున్నది.

ఏమిటీ వింత అనుభవం? కలా? నిజమా? అని తల పోస్తూ మంజువాణి బెర్తుపైన తలవాల్చింది.

---

# 8

రైలుబండి ఢిల్లీ చేరింది.

మంజువాణి ఢిల్లీ స్టేషన్‌లో కాలు పెడుతూ, అసలు తాను ఇక్కడకు ఎందుకొచ్చినట్టు అని తనలో తానే ప్రశ్నించుకొంది.

బజారు మనిషిని అందలం ఎక్కించి, సంఘంలో ఉన్నతమైన స్థానాన్ని కల్పించి, మహానుభావులందరిని ఇట్టే ఆకర్షించే అందాల రాణిగా తనను తయారుచేసిన మదన మోహనుడు, పెళ్ళాడవలసిందని తనను ప్రాధేయపడడమేమిటి! తాను కాదనడమేమిటి! ఇదంతా విచిత్రంగా తోస్తున్నది యిప్పుడు మంజువాణికి.

నిజమేమరి, పల్లెటూరునుంచి కట్టుబట్టలతో నగరానికి చేరి, బత్తెడు పొట్టకోసం ఉంపుడుకత్తెగామారి, బజారులంట పడి తిరుగుతున్న మంజువాణిని మదనుడు ఒకమనిషినిచేశాడు.

ఆమె తన శరీరాన్ని పూలపళ్ళెంలో పెట్టి అతనికి మనః పూర్వకంగానే సమర్పించింది. నిజమే. కాని, శరీరంతో పాటు మనస్సునుకూడా తనకు అర్పించవలసిందిగా అతను కోరితే, అందుకు ఆమె తటపటాయించింది. ఎందుచేత?

ఏమో? ఎవరికి తెలుసు, ఆమెకే ఆ విషయం తెలి యదు. ఆడవాళ్ళ మనస్సులు పొంగే నదీప్రవాహంవంటివి. ఎప్పుడు సుడిగుండాలు ఏర్పడతాయో, ఎక్కడ కట్టకు

గండ్లుపడి, కట్టలు తెగిపోతాయో, మరెప్పుడు ఆ ప్రవాహ వేగం సద్దుమణిగిపోతుందో చెప్పడం కష్టం.

పోర్టరు మంజువాణి సామానును నెత్తిన పెట్టుకొని, బయటకు దారితీశాడు.

ఆమె పోర్టరును అనుగమించింది, టాక్సీస్టాండుచేరింది. టాక్సీయెక్కి మదనమోహన్ చెప్పిన హోటల్‌కు వెళ్ళింది. అక్కడ హోటల్ అధిపతులు ఆమెకోసం అన్ని ఏర్పాట్లు ముందుగానే చేసివుంచారు.

మంజువాణికి కేటాయించినగది బాగానేవుంది. అన్ని సదుపాయలూ వున్నవి. ఆమెకన్నా ముందుగానే, ఆమెపేర కొన్ని ఉత్తరాలు వచ్చి వున్నాయి. ఉత్తరాల కట్టతో పాటు కాఫీకప్పు సిద్ధమైంది. ఆమె సోఫాలో కూర్చుని, తిరిగ్గా కాఫి త్రాగుతూ ఉత్తరాలు చదువుకొంది.

నరనారీని కేతనం విషయమై తాను కలుసుకొనవలసిన వ్యక్తి శ్రీహరి. అతను మదనుడి ఆప్తమిత్రుడు. శ్రీహరే స్వయంగా ఫోను చేస్తాడని మదనుడు లేఖ వ్రాశాడు. ఆ ఫోన్ కాల్ వచ్చేవరకు తాను ఢిల్లీలో చేయువలసిందేమిటో మంజువాణికి తోచలేదు.

మదనమోహన్ పెళ్ళి ప్రతిపాదన గుర్తుకొచ్చింది. రైలులో అపరిచిత వ్యక్తి విచిత్ర ప్రవర్తన తలపుకొచ్చింది. ఎవరో తను? ఎందుకలా ప్రవర్తించాడు? పిచ్చివాడా? యిలాంటి విచిత్ర వ్యక్తులుంటారా? వాళ్ళ జీవిత పరమావధి ఏమిటో! నాకున్నదిగనుక ఆమనిషికి వుందా అని నేను అనుకోవాలా? మంజువాణి తనలోతానే నవ్వుకొంది. లోకం

పోకడే గమ్మత్తు. మానవులలో పశుప్రవృత్తి పూర్తిగా నశించిందా? సంఘంలో అంతా సాధుతత్వమే అయితే, ఇక జీవితంలో వైవిధ్యం ఎక్కడ? ఉప్పూ, కారం కలిస్తేనేగదా కూరకు రుచి! మానవునిలో కామం, క్రోధం నశిస్తే, జీవితంలో చప్పదనమేగదా మిగిలేది?

చీకటి వుంటేనే వెలుగు విశిష్టత. చెడు లేకపోతే మంచిలో గొప్పతనం కన్పించదుగా?

వేదాంతంలో పడిపోతున్నది మంజువాణి. భోగి చివరకు విరాగిగా మారక తప్పదంటారు అనుభవజ్ఞులు. మనస్సు మార్పును కోరుతుంది.

"హలో, గుడ్‌మార్నింగ్, మిస్ మంజువాణి"

ఆలోచలోపడి మునిగితేలుతున్న మంజువాణిని ఎవరో సుపరిచితుడుమల్లే పలుకరించాడు ఒక అపరిచితుడు.

ఆ అపరిచిత వ్యక్తి సరాసరి గదిలోకివచ్చి, ఆమెకు ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

మంజువాణి విస్తుపోయింది. ఏమిటీ నగరవాసుల తీరు? ఎక్కడనుంచి వస్తుంది వారికి ఇలాంటి చొరవ? ఏమీ ఎరుగకపోయినా అంతా ఎరిగినట్లే ప్రవర్తిస్తారు వింతమనుష్యులు.

"మీరు ఎప్పుడు వచ్చింది, ఎందుకు వచ్చింది, ఎలా వచ్చింది, అన్ని ఆరాలు తీశాను. మీరు నన్ను ఎరుగకపోయినా, మిమ్మలను నేను పూర్తిగా ఎరుగుదును. ఎందుకు అలా బెదురు చూపులు చూస్తారు?"

ఆ మెరుపు దాడినుంచి కాస్త తేరుకున్న మంజువాణి, గంభీరవదనయై, కొంచెం కఠినంగానే అన్నది.

"కంటబడిన ఆడదానివెంట పడడమేనా మీపని? మనిషిపుటక పుట్టినతర్వాత కాస్తన్నా బుద్ధివుండాలి."

. ఆ మందలింపు, ఆవ్యక్తికి ఏనుగమీదపడిన వానచినుకులుగా వున్నాయి. అతను ఏమాత్రం చలించలేదు.

"బుద్ధి అనే పదార్థం నాకేకాదు, చాలామందికిలేదు. అయినా నీ మేలుకోరి వచ్చిన నామీద నీ కింత ఆగ్రహ మెందుకు?"

"మీకు పుణ్యం వుంటుంది. దయచేసి ఇక్కడనుంచి వెంటనే వెళ్ళిపొండి"

"వెళ్ళిపోతాను, తప్పక వెళ్ళిపోతాను. మనమంతా ఎప్పుడో ఒకప్పుడు వెళ్ళిపోవలసినవాళ్ళమే. పనిపూర్తి చేసుకొని వెళ్ళిపోతాను."

"అదే, విసిగించక విషయమేమిటో చెప్పండి. వేయి మైళ్ళ రైలుప్రయాణంచేసి వచ్చాను. అసలే ప్రయాణ బడలికతో చస్తున్నాను."

"మీ జీవిత సంగ్రహం చెప్పండి. మిమ్మలను ఇంటర్వ్యూ చేయడానికే నేనిక్కడకు వచ్చింది. "భారతనారి" పత్రిక ప్రతినిధిని."

"అలాగా అన్నా; అయితే క్షమించు. ఆ మాట మొదటే చెప్పావుకాదు! ఉండండి. కాఫీ తెప్పిస్తాను" అంటూ ఆమె బెల్ నొక్కి బోయ్‌ని పిలిచి, కాఫీకి ఆర్డరిచ్చింది.

ఆ పాత్రికేయుడు సగర్వంగా కాలర్ సరిచేసుకొన్నాడు. కామ వ్యామోహంవంటిదే ప్రచార వ్యామోహం.

అనేకమంది పురుషులు మంజువాణికి అడుగులకు మడుగులొత్తారు. కాని, అదే మంజువాణి చిన్న పాత్రికేయు నికి రాజమర్యాదలు చేస్తున్నది.

మంజువాణి తన జీవిత విశేషాలన్నింటినీ ఏకరువు పెట్టింది. అందులో వాస్తవాలకన్న కల్పనలే జాస్తి. ఆ పాత్రికేయుడు ఆమె చెప్పిన సంగతులన్నీ నోట్‌బుక్‌లో ఎక్కించుకున్నాడు.

"సార్. అన్నట్టు మీ ఫొటో ఏదన్నా వుంటే ఇవ్వండి. బ్రహ్మాండమైన 'లైఫ్ స్కెచ్' పసందైన జీవిత కథకు అందమైన మీ ఫొటో లేకపోతే నిండుతనం రాదు."

మంజువాణికి పెద్దచిక్కేవచ్చిపడింది. చచ్చి తనఫొటో ఏదీ తనదగ్గరలేదు.

"ఏక్చి, ఫొటో ఏదీ నా దగ్గరలేదే? ఎలాగా? పోనీ, స్టూడియోకివెళ్ళి, బస్టు తీయిద్దామా?"

"భేష్. గొప్పగావుంది ఐడియా, బయలుదేరండి"

"మీ పేరేమిటో తెలియదు కానండి, అంత తొందర మనుషులేమిటి మీరు! ఈ ఆకారంలో నన్ను ఫొటో దిగ మంటారా?"

"నన్ను భీమేశ్వరరావు అని పిలుస్తుంటోంది ఈ పాడు లోకం అయితే త్వరగా స్నానంచేసి, సింగారించుకురండి."

మంజువాణి గబగబా స్నానంచేసింది. ఝునక్, ఝునక్ రవిక తొడిగింది. రవిక చేతులు మోచేతి క్రిందకు దిగినవి. వీపులో సగభాగం, ముందు పొట్ట పూర్తిగా కన్పించేటంత

కురచ ఆ రవిక, అదే ఈనాటి ఫేషన్. దేవతా వస్త్రాన్ని పోలిన షిఫాన్‌చీర ధరించింది.

భీమేశ్వరరావు, మంజువాణి చట్టపట్టాల్ పట్టుకొని బయలుదేరారు. వారిద్దరినిచూస్తే ఆప్తమిత్రులో, ఆత్మ బంధువులో అనుకోవలసిందే.

"సెక్స్ అప్పీల్" పోజులో ఫోటో తీయించుకున్న మంజువాణి, పాత్రికేయుడిని వెంటబెట్టుకుని ఢిల్లీనగరం చూడ డానికి బయలుదేరింది. టాక్సీలో నగరమంతా తిరిగారు. చివ రకు భీమేశ్వరరావు ఆమెను పెద్దహోటల్ లోకి తీసుకెళ్ళాడు.

"ఏమిటి అన్నా, నన్ను కైలాసగిరి ఎక్కిస్తున్నావ్?"

"అవును చెల్లీ, ఈ హోటల్ నిజంగా కైలాసగిరే. చూస్తే నీకే తెలుస్తుందిగా. పద లోపలకు"

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. రకరకాల పదార్థాలు, పానీయాలు పొట్టలలోకి లోడుచేస్తూ, కేరింతలు కొడుతు న్నారు. 'కైలాసగిరి' లో చిద్విలాసం అనుభవిస్తున్నారు.

ఇంతలోకి ఎవరో పెద్దమనిషివచ్చి భీమేశ్వరరావు వీపు తట్టాడు. భీమేశ్వరరావు వెనుదిరిగిచూచి, "ఓహో, మీరా రండి, కూర్చోండి" అని ఆ పెద్దమనిషిని ప్రక్కనే కూర్చో బెట్టాడు.

ఆ పెద్దమనిషి రెప్పవాల్చకుండా మంజువాణి వంక చూస్తున్నాడు. ఇది ఆమె గమనించింది. అతని వాలకాన్ని తదేకంగా కనిపెడుతున్నది.

భీమేశ్వరరావు పెద్ద చిక్కులో పడిపోయాడు.

"ఈయన హోటల్ కైలాసగిరి ప్రొప్రయిటర్. పేరు పాల్ఘాట్ చిదంబరంగారు. ఈమె మిస్ మంజువాణి. ప్రసిద్ధ సాంఘిక సేవకురాలు" అని ముక్తసరిగా భీమేశ్వరరావు వారిద్దరిని పరస్పరం పరిచయం చేశాడు.

"మరి, సెలవు. 'భారతనారి' పత్రిక ప్రచురణ తేదీ రేపే. 'మీ జీవిత సంగ్రహ వ్యాసం' పూర్తిచేసి ప్రెస్‌కు పారేయాలి-వెళ్ళొస్తా" అంటూ భీమేశ్వరరావు నట్టేట చిడతలుకొట్టి రంగంనుంచి నిష్క్రమించాడు.

నగర జీవితమే పెద్ద మాయ. అంతా అపరిచితులే. అయినా నిముషాలమీద పరిచయాలు ఏర్పడతాయి. మరొక కొత్తముఖం మంజువాణిముందు ప్రత్యక్షమైంది.

మంజువాణి అర్థంలేకుండా చిన్న నవ్వు విసిరింది.

డబ్బుకు కొరగాని పాత్రికేయునితో కాలక్షేపంకన్నా డబ్బున్న చిదంబరంలో నేస్తంకట్టడం మంచిదనుకొంది మంజువాణి.

"బయలుదేరు భామినీ, పై అంతస్తుకు పోదాం" అంటూ పాల్ఘాట్ చిదంబరం మంజువాణి చేతిని పట్టుకొని మేడ మెట్లవైపు దారితీశాడు.

మూడంతస్తుల హోటల్ అది. సకల సదుపాయాలతోను గదులు చక్కగా వున్నాయి. హోటల్ ఆర్భాటం చూసి మంజువాణి ముగ్ధురాలైంది.

"నీకేమి కావాలో కోరుకో కామినీ. కొండమీదనున్న కోతినైనాసరే తెప్పించి నీకు అర్పిస్తాను"

"నేను అంటే మీకెంతుకింత ప్రేమ? ఏమిటీ మాయ?"

"మన జీవితమే పెద్ద నాటకం, వట్టి బూటకం. 'పూర్తిగా అనుభవించండి' అని దేవుడు మనకు జీవితాన్నిచ్చాడు. బ్రతికినన్నాళ్ళు హాయిగా బ్రతకాలి. అదే నా సిద్ధాంతం."

ఇద్దరూ ఒక గదిలోకి చేరారు. అది చిదంబరం సొంత గది. స్వర్గధామాన్ని పోలివుంది మంజువాణి సోఫాలో ఆసీనురాలైంది. చిదంబరం పెద్ద వైన్ బాటిల్ తెచ్చి మంజు ముందుంచాడు. తలుపు గడియ వేశాడు. వచ్చి ఆమె పక్కనే కూర్చున్నాడు. అతను 'వైన్ బాటిల్' బిరడా విప్పాడు. మంజు హృదయం నెమలివలె పింఛం విప్పింది. నింపిన గ్లాసులు వాళ్ళిద్దరు ఖాళీచేశారు.

పిమ్మట విస్కీబుడ్డి విప్పారు. అది నెమ్మదిగా ఖాళీ చేస్తున్నారు. నిషా ఎక్కిన చిదంబరం ఖుషీచేయడం ప్రారంభించాడు. అతడు తనచేతితో మంజువాణి సన్నటి నడుమును బంధిస్తున్నాడు.

"అబ్బ, వూరుకోండి. ఏమిటీ సరసం?" అంది నిషా పూర్తిగా ఎక్కని మంజువాణి.

అతడు ఆమెను ముద్దెట్టుకోబోయాడు. ఆమె నివారించింది. అయినా చిదంబరం తన ప్రయత్నం మానలేదు.

అతని మొరటుతనంచూచి ఆమెకు ఎక్కడలేనికోపం వచ్చింది. నిగ్రహం కోల్పోయింది. బలంకొద్దీ అతని చెంప మీద చెళ్ళున చరిచింది. అతను ఉలిక్కిపడ్డాడు. మత్తు వదిలింది.

"అంత కోపమేలా మంజూ, ఇష్టపడే నా గదికి వచ్చావు గదా, తీరా సమయం వచ్చేసరికి ఏమిటీ పేచీ?"

"నోర్మూయ్, మగవాళ్ళకన్నా పశువులు నయం. కంటికి కాస్త నదురుగా కన్పించే ఆడది కంటపడితే చాలు. పిచ్చికుక్కలవలె ప్రవర్తిస్తారు."

"మాలో పిచ్చిని ప్రేరేపిస్తుంది మీరేగా? లేకపోతే ఈ అంగప్రదర్శనమేమిటి?" అంటూ ఆమె వక్షస్థలంవైపు వేలెత్తి చూపెట్టాడు.

"అది మా యిష్టం. నాకు నచ్చిన విధంగా సింగారించుకొనే స్వేచ్ఛ నాకు వున్నది. నీ వేమీ వేలెత్తి చూపవసరంలేదు. కళ్ళుంటే చూచి ఆనందించు. అంత వళ్ళుమీరి ప్రవర్తిస్తే మాత్రం, నీకు బుద్ధిచెప్పడ మెలాగో నాకూ తెలుసు."

"నా కర్మంకాలి నీదగ్గరే బుద్ధులు నేర్చుకోవాలా? సరే, ఈవేళ్టకి నిన్ను వదిలేస్తున్నాను. మరొక చాన్స ఇస్తున్నా. నీకు ఎప్పుడు అవసరమొచ్చినా నాదగ్గరకువచ్చేయ్. నీకు కావలసిన సహాయం చేస్తాను"

"సంతోషం"

మంజువాణి చెదిరిన కురులు, తొలగిన పమిట సర్దుకొంటూ వయ్యారంగా ఆ గదినుంచి బయటకు వచ్చింది.

వీధిలో టాక్సీ ఎక్కింది.

ఆ టాక్సీకి, తన బ్రతుకుకి తేడా ఏమిటి? అని ఆలోచించసాగింది మంజువాణి. ఏమాత్రం తేడాలేదు. తనది నిజంగా టాక్సీబ్రతుకే.

మదనమోహన్ చెప్పినట్లు, పెళ్ళిచేసుకొంటే ఈ తిప్పలన్నీ వుండవుగా? తాను సంఘంలో గౌరవంగా బ్రతకవచ్చుగా? పెళ్ళిఅయిన స్త్రీ పేదరికంలో వుంటేమాత్రమేం? ఆమెకు సంసారంలోవుండే గౌరవం వేరు, తాను సంపదలో మునిగి తేలుతుంటే మాత్రమేమి, అంతా చులకనగా చూసేవారే.

పెళ్ళి చేసుకోవడమే మంచిదేమో అన్న అభిప్రాయం ఆమెలో క్రమంగా పొడసూపసాగింది. హోటల్‌కువెళ్ళి తన గదిలో మంచంపై మేనువాల్చి, అలా ఆలోచిస్తూనే కొద్ది క్షణాలలో మైమరచి నిద్రపోయింది మంజువాణి.

---

# 9

ఆనాడు ఆదివారం. ఉదయానే శ్రీహరి ఫోను చేశాడు, సాయంత్రం ఆరుగంటలకు హోటలు గదికి వస్తానని.

ఆవేళ మంజువాణి గది విడిచి, కాలు కదపలేదు. తెల్లవారే సరికే "భారతనారి" గదిలో ప్రత్యక్షమైంది ఆ పత్రికలో తన జీవితగాథ, ఫోటో ప్రచురిత మయ్యాయి. నిజంగా పత్రికా రచయితలు అసాధ్యులు అబద్ధాన్ని సబద్ధంగా చిత్రించగల దిట్టలు. అసలు తాను భీమేశ్వరరావుకు చెప్పిందే కట్టుకథ. ఆ కట్టుకథకు చిలవలు, పలవలు అల్లి, మరింత విచిత్రమైన గాథగా మార్చాడు ఆ పాత్రికేయుడు. ఆమె తన జీవిత గాథను చదువుకొని, నివ్వెరపోయింది. ఇంత కన్నా వంచన, ఆత్మవంచన ప్రపంచంలో మరొకటి వుండదు గదా అనుకొంది. లేకపోతే, అనాధ బాలబాలికల ఉద్ధరణకు తానేమిటి, తన జీవితాన్ని అంకితం చేయటమేమిటి? ఎవరన్నా చూస్తే నవ్విపోరు? అనాధలను చరితార్థులను చేయడంకోసమే తాను సంసారాన్ని ఇహలోకపు సౌఖ్యాలన్నిటినీ, త్యాగం చేసిందట. భలే! ఎంతటి కమ్మని అబద్ధం!!

ఇక, ఆ పత్రిక ముఖచిత్రంపై అచ్చయిన తన ఫోటో సంగతా? బ్రహ్మాండంగావుంది. ఆ ఫోటోను చూసి, ఎంతటి నిగ్రహాపరుడికైనా, మనస్సు చలించక తప్పదు. అలాంటి ఆడది సర్వసౌఖ్యాలు పరుల సేవకు త్యాగం చేసిందంటే

అసలు బుద్ధివున్న వాడెవ్వడైనా నమ్ముతాడా? నమ్మనునేనా ఆ పత్రికా సంపాదకులు అలాంటి ఫోటోను అచ్చువేయించింది? ఏమో, ఈ లోకంలో బుద్ధివున్నవాళ్ళ సంఖ్యకన్నా, అది లేనివాళ్ళు ఎక్కువగా వున్నారేమో? అందుకే ఇలాంటి పత్రికలు చెల్లుతున్నవేమో?

* * *

ఆరుగంటలు కొట్టడమేమిటి, శ్రీహరి వచ్చి తలుపు తట్టడమేమిటి రెండూ ఒకేసారి జరిగిపోయాయి.

మంజువాణి హడావిడిగా లేచి అద్దము దగ్గరకు వెళ్ళి, ముంగురులు సర్దుకొంది. పెదాలకు రంగు పూసుకొంది. ఎందుకో అంత హడావిడి! అది ముదితలకే తెలియాలి.

ఆమె వెళ్ళి తలుపు తీసింది.

ఆమె శ్రీహరిని చూసింది.

శ్రీహరి ఆమెను చూశాడు.

క్షణంపాటు ఇద్దరు అలా ప్రతిమలైపోయారు.

కొద్దిసేపటికికాని వారు ఇద్దరు గుక్కతిప్పుకోలేక పోయారు.

"మీరా!"

"నువ్వా!"

ఇద్దరికి ఆశ్చర్యమే! తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు.

"ఇది కలకాదుకదా?" అనే మాటలు అప్రయత్నంగా ఆమె నోటినుంచి ఊడిపడ్డాయి.

"ఇది నిజమా?"

మంజువాణి తన పెదిమ కొరుక్కుంది.

రైలులో కన్పించిన వింతవ్యక్తే శ్రీహరి.

అనుకోకుండా తటస్థపడిన ఆ పూబోడి మిస్ మంజువాణి.

భలే!

ఇద్దరూ తమలో తామే నవ్వుకున్నారు.

శ్రీహరి అమాంతంగా ఆమెను కౌగలించుకొన్నాడు. ఆమె ఉక్కిరిబిక్కిరి అయింది.

"అబ్బ, ఉండండి" అంటూ మెల్లగా అతని కౌగిలి నుంచి బయటపడి, వెళ్ళి సోఫాలో కూర్చుంది.

"మొత్తానికి మీరు ఘటికులే. రైలులో అన్నమాట నిలుపుకొన్నారు."

మంజువాణిమాట శ్రీహరికి అర్థం కాలేదు. అయినా అర్థమైనట్టే నటించాడు.

"మరేమిటనుకున్నావ్, మాటంటే మాటే"

"ఏమిటా పిచ్చిచూపులు? చూపులతో నన్ను కొరుక్కుతింటున్నారు."

మంజువాణి మాట అతని బుర్రకెక్కలేదు. తన్మయత్వంలో మునిగి తేలుతున్నట్టున్నాడు.

"మీరు మురిసిపోతున్నంత అందం నాలో లేదే? ప్రబంధాలలో మహాకవులు చిత్రించిన నాయికలకు ఉండే లక్షణాలేవీ నాలో లేవే? అయినా మీరెందు కింతగా ముగ్ధులైపోతున్నారు?"

మంజువాణి ప్రశ్నకు శ్రీహరి సమాధానం చెప్పలేదు. నిజానికి జవాబు చెప్పలేడుకూడా. మంజువాణిలోని ఆకర్షణ శక్తి ఎలాటిదో ఎలా వివరించి చెప్పగలడు? అది కవులకే అసాధ్యం. శృంగార పురుషులు అందాన్ని అనుభూతి పొంద గలరేగాని, ఆ అనుభూతికి రూపకల్పన చేయడం వారి చేత కాదు. ఆ మాటకొస్తే అది వారిపనికాదు. అనుభవించ డానికి వారు పుట్టారు. ఆలోచించకుండా అనుభవిస్తారు. అంతే.

"ఇంతకీ, వచ్చినపని పూర్తిగాకుండానే, ఏమిటీ కాల హరణం?" అని విషయాంతరంలోకి వెళ్ళింది మంజువాణి.

"తొందరేల సుందరీ? తొడిగిన మొగ్గ వికసించకుండా వుంటుందా? వికసించిన పుష్పం పరిమళించకుండావుంటుందా? ఆరంభమైన కథ రసవత్తరంగానే ముగుస్తుందిలే."

ఆమెకు కొంచెం విసుగుపుట్టింది. అర్ధంపర్ధంలేని ఆ పాడుసోది వినలేక.

"నరనారీ నికేతనమే" గ్రాంటు విషయం త్వరగా తేల్చండి.

"తేల్చడానికేముంది? మునిగిపోతున్న పడవను దరి చేర్చడానికేగదా మేము వుంది?"

"అంటే?"

"అంతే"

"అయితే మా నికేతనానికి పాతిక వేల రూపాయలు మీ సంస్థ తరఫున గ్రాంటు మంజూరు చేస్తారా?"

"నీవంటి ఆడది నోరుతెరచి అడగటం, ఈ శ్రీహరి కాదనటం ఇలలో కలదా?"

"అయితే, నేను ఈ రాత్రికే తిరుగు ప్రయాణ మౌతాను."

"ఈవేళ ఆదివారం అన్న విషయం మరచిపోకు, బ్యాంకులు వుండవుగా. రేపో ఎల్లుండో డ్రాఫ్ట్ చేతపుచ్చుకొని, విజయం చేద్దువుగాని. ఈ రాత్రికి హాయిగా గడుపుదాం. ఏమంటావు?"

వచ్చినపని క్షణంలో పూర్తిఅయింది. నెత్తిమీద బరువు తొలగిపోయింది. రాత్రంతా శ్రీహరితో జల్సాగా గడపాలని ఆమెలో బలీయమైన కోర్కె బయలుదేరింది

"సరే"

ఆమె 'సై' అనటమే తడవుగా శ్రీహరి ఆమెను తన బాహువుల్లో బంధించి బలంగా ముద్దెట్టుకొన్నాడు. ఆ క్షణాన ఆమె ఎన్నడూ అనుభవించని స్వర్గానందాన్ని అనుభవించి నట్టు భావించింది; లేదా భ్రమించింది. ఆమెలో కామేచ్ఛ ఉగ్రరూపం దాల్చింది. శ్రీహరిని గట్టిగా కౌగలించుకొని, అతని పెదాలపై అదేపనిగా, ముద్దులవర్షం కురిపించింది. ఆమెకు తనివి తీరడంలేదు.

ఇంతలోకి తలుపుకొట్టిన చప్పుడైంది. రసవత్తరమైన ఘట్టంలో ఏమిటది? పానకంలో పుడకవలె? ఆమెకు విపరీత మైన కోపంవచ్చింది. శ్రీహరిని సోఫాలో కూర్చోబెట్టి ఆమె తలుపు దగ్గరకువెళ్ళి గడియతీసి చూచింది.

మదనమోహనుడు ప్రత్యక్షమయ్యాడు. మంజువాణి ముఖం వివర్ణమైంది. ఆమె గది బయటకువచ్చి తలుపు వేసి, తన విసుగుదల నంతను మదనుడిమీద విసిరింది.

"కొంప మునుగుకు పోయినట్లు కాస్త వైర్ అయినా ఇవ్వకుండా ఇలా ఊడిపడటమేమిటి?"

"నిన్ను విడచి వుండలేకపోయాను మంజూ? నీకోసం పరితపిస్తూ పరుగెత్తుకొచ్చాను."

"అఘోరించలేకపోయావు! నీతో మాట్లాడడానికి నాకు ఇప్పుడు తీరికలేదు. ఓపికాలేదు. దయచేసి వెళ్ళిపో. రేపు ఉదయాన రా." మంజువంటి కోమలాంగి అంత కర్కశంగా మాట్లాడగల్గుతుందని పాపం అతను కలలో కూడా ఊహించుకొని ఉండడు, అతని మనస్సు చివుక్కుమంది.

"లోపల ఎవరైనా ఉన్నారా?"

"ఉంటే వుండవచ్చు. అదినీకెందుకు?"

"ఇది నీకు ధర్మంకాదు"

"నాకు ధర్మభోధ చేయగల్గిన అర్హత నీకు లేదు"

"ఇందుకేనా నిన్ను ఇక్కడకు పంపించింది?"

"నేను ఇప్పుడు నీతో వాదులాడలేను. దయచేసి రేపు ఉదయాన రండి" అంటూ ఆమె మదనుడు చెప్పబోతున్న మాటనైనా విన్పించుకోకుండా లోపలకు వెళ్ళి 'ఠఫీ' మని తలుపు వేసింది.

శ్రీహరి లోపల వున్నాడని మదనుడికి తెలిస్తే, వారిద్దరి స్నేహం చెడిపోవడమేకాక, ఎన్నో పరిణామాలకు దారి

తీసే ప్రమాదం వుంది. అందుకే మంజువాణి అంత కర్కశంగా మదనుడితో ప్రవర్తించింది.

"ఎవడు వాడు?" అని అడిగాడు శ్రీహరి.

"ఎవడో తాగుబోతు వెధవ. పూర్వపరిచయాన్ని పురస్కరించుకొని రభస చేయడానికి ఊడిపడ్డాడు. తన్ని తరిమేశాను."

"భలేపని చేశావ్"

"ఇక్కడవుంటే మనకు మనశ్శాంతి వుండదు గాని, ఎక్కడికైనా పోదాంపద"

మంజువాణి సూచన శ్రీహరికి నచ్చింది.

ఇద్దరూ బయటకు బయలుదేరారు, కామం వారి ముఖాలలో, కళ్ళలో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నది.

---

# 10

అసలు విలాసాలకు అలవాటు పడనే కూడదు. అల వాటు పడ్డామా, ఇక జీవితాంతంవరకు జీవితానికి తృప్తి వుండదు. ఎప్పుడూ ఏదో ఒక అసంతృప్తే. తృప్తిలేని బ్రతుకు పొందే వెతలు ఇన్నీ అన్నీ కావు. ఎన్ని భోగాలు అనుభ వించినా, ఇంకా ఇంకా అనుభవించాలనే వుంటుంది. ఆ తప నకు అంతు వుండదు ఒక విధంగాచూస్తే కష్టజీవులే తృప్తిగా పరిపూర్ణంగా జీవిస్తున్నారనిపిస్తుంది.

మంజువాణి విలాసాల సుడిగుండంలో చిక్కుకొని, దానినుంచి బయట పడలేక పోతున్నది.

మంజువాణి, శ్రీహరితో కలిసి కారెక్కింది. అటు మదనమోహనుడిని, ఇటు శ్రీహరిని ఒకరికి తెలియకుండా మరొకరిని మోసగించానని ఆమె ఆత్మ సంతృప్తి చెందు తున్నది. తన తెలివికి తానే మురిసిపోయింది.

ఎవరికివారు తాముచేసే పనులకు ఏవో కుంటి సమర్థ నలు వెతుక్కుంటూ, సరిపుచ్చుకుంటారు. అది మానవ సహజం.

"నీ ప్రియుడు, నా ఆప్తమిత్రుడు అయిన మదనుడికి నీవు ఇప్పుడు చేసిన సత్కారం నిజంగా నాకు విచారం కలిగి స్తున్నది."

గోప్యం కాస్తా శ్రీహరి గ్రహించడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది మదిలో మెరిసిన ఆశ్చర్యాన్ని అణచుకుంటూ, ఆమె చిలిపిగా నవ్వింది.

"లేకపోతే పానకంలో పుడకలాగా, రసభంగంచేస్తే నేను ఎలా సహించగలను? మంచీ, మర్యాదా అక్కరలేదా? నేనేమన్నా తాళికట్టిన పెళ్ళాం అనుకోన్నాడా? వేళాపాళా లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు ఎదురేగి స్వాగత మివ్వడానికి?"

"పోనీ మర్యాదగా చెప్పి పంపలేకపోయావా?"

మర్యాదగా చెబితే మగాళ్ళు వింటాగా? ఆ మాట కొస్తే, మీరుమాత్రం విన్నారు కనుకనా? 'వద్దు వద్దు' అంటున్నా నాలో నిద్రాణంగావున్న కామేచ్ఛను మీరు లేపారుగదా? లేకపోతే ఈ పరిస్థితే తటస్థించేది కాదుగా? నీ ప్రియమిత్రునికి ఈ పరాభవం చేయవలసిన అవసరం ఏర్పడేదే కాదుగదా"

"నన్నేమి చేయమంటావ్ మంజూ" నిన్నుచూస్తుంటే నేను మజ్నూనై పోతున్నాను."

"నీవేకాదు! నీలాంటి చాలామంది ఇలాగే అన్నారు"

"అంతటి ఆకర్షణశక్తిని దేవుడు నీలో పొదిగాడు"

"మీరు భ్రమిస్తున్న యోగ్యురాలనుకాను నేను, పతితమైన బ్రతుకు నాది."

"నీవు పతనం చెందినా నీ శరీంలోని కామసౌందర్యం ఏమాత్రం తగ్గలేదు. అదే నాకు కావాలి. నా హృదయాన్ని రెచ్చగొట్టి, ఒడలు పులకింపచేసే స్త్రీ నాకు అవసరం"

ఈ కామాలాపనను ఏమంటారండీ?"

"ప్రేమాలాపన"

"మగవాళ్ళకు బొత్తిగా బుద్ధిలేదయ్యా?"

"ఆడవాళ్ళకు రవ్వంత సిగ్గులేదమ్మా"

ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు.

మహావేగాన పయనిస్తున్న చిన్నకారు రభీమని ఆగి పోయింది. ఆ కుదుపుతో వారిద్దరు ఒకరిపై మరొకరు వాలి పోయారు.

ఆ దృశ్యం చూడలేక డ్రైవర్ ముఖం ప్రక్కకు తిప్పు కొన్నాడు.

కామారాధకులు ఇద్దరూ ఎదురుగావున్న సుందరమైన భవనంలో ప్రవేశించారు.

*                *                *

అన్నింటికి నానార్థాలున్నట్టే, ఇంటికి నానార్థాలు న్నాయి.

ఇల్లంటే కొందరికి తలదాచుకొనేందుకు, ఎండకు ఎండకుండా, వానకు తడవకుండా, చలికి వణకకుండా, కట్టు కున్న కొంప. మరికొందరికి అది పవిత్రస్థలం వంటిదికావచ్చు. మరికొందరికి అది కళాజగత్తు కావచ్చు. ఇంకొందరికి భోగాల నిలయం కావచ్చు. వారివారి స్తోమతలనుబట్టి, సంస్కారాన్ని బట్టి అది రకరకాలుగా వుంటుంది.

ఈ భవనంలో ప్రవేశించిన మంజువాణి నిర్ఘాంత పోయింది. నివ్వెరపాటు పొందింది. అచేతనంగా కొద్దిక్షణాల

పాటు నిలబడిపోయింది. దైవభక్తి పరులైనవారు ఏడుకొండల వెంకటేశ్వర విగ్రహాన్ని చూస్తే, నిజంగా నిశ్చేష్టులై నిర్లిప్తులౌతారట. తదాత్మ్యం పొందుతారట. సరిగ్గా అలాంటి స్థితిలోనే మంజువాణి పడిపోయింది.

అదొక పెద్ద చిత్రపటం. ఆరడుగుల పొడవు, నాలుగడుగుల వెడల్పుగల పటం. కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నది. అందులో ఇద్దరి చిత్తరువులున్నాయి. ఇద్దరూ దిగంబరులే. స్త్రీ పురుషులు. అతడు అందగాడు, బలిష్టుడు. శౌర్యం అతని ముఖంలో తొణికిసలాడుతోంది. అంత అందగత్తె, అతని ప్రక్కనే కూర్చుని, పరిచర్యలు చేస్తున్నది. అతను ఆమె ముంగురులు సవరిస్తున్నాడు. గదిలో పూర్తి వెలుతురులేదు. నీలిరంగు వెదజల్లుతున్న విద్యుత్ దీపం ప్రేయసీ, ప్రియుల హృదయాలలో కామం ప్రకోపింపచేసే చంద్రునివలె వున్నది.

ఈ వాతావరణం ఆ జవరాలి హృదయాన్ని జ్వలితం చేసింది. శ్రీహరి నెమ్మదిగా మంజువాణి ప్రక్కన జేరి, ఆమె కురులు సర్దుతున్నాడు.

"ఆ స్త్రీ మూర్తిలో ఉట్టిపడుతున్న విధేయభావం, భక్తి తత్పరత నాకు కూడా వుంటే ఎంత బాగుండును" అని మంజువాణి తనలో తానే గొణుగుకుంది.

"కామినీ, పిచ్చి భామినీ, నీనుంచి నేను కోరుతున్నది. అలాంటి పరిచర్యలుగాదే; నీలోని కామేచ్ఛను ఉచ్ఛస్థాయికి తీసుకుపోతున్న నీ శరీరాన్ని నేను గాఢంగా కామిస్తున్నాను."

మంజువాణికి కొద్దిగా కోపం ముంచుకొచ్చింది. వెళ్ళి దూరంగా కూచ్చుంది. అంగన అలుక అదో ముచ్చటగా వుంటుంది.

అసలే మత్తెక్కి వున్న మనస్సులకు, మరింత మత్తెక్కించడానికి శ్రీహరి రెండు మూడు వైన్ బ్రాందీబుడ్లు తెచ్చి బిరడాలు విప్పాడు. అలిగిన అతివను అతను లాలించాడు, బ్రతిమాలాడు. ఇద్దరూ కలసి బుడ్లు ఖాళీచేశారు. ఇద్దరికీ బాగా కైపెక్కింది.

"మంజూ ఎలాగుంది?"

"ఏమని చెప్పేదు, శ్రీహరీ!"

"ఈ మందు కనిపెట్టిన మహానుభావుడు ఎవడో కాని, అమాంతం కావిలించుకొని, వేయి ముద్దులు బహుమతి ఇవ్వబుద్ధేస్తున్నది."

"నోర్మూయ్, శ్రీహరిని ఎదుటపెట్టుకొనే నీవు అంత మాట అంటావా? అంతపని చేస్తావా? కులటా!"

"నేను కులటనా? ఓ, ఎస్, కులటనే. కులటనుకాకపోతే, నీకెలా దక్కుతాను? నీ కాళ్ళకు మొక్కుతా, అనుభవించు, శ్రీహరీ అనుభవించు. పూరాగా అనుభవించు. సంతాపంతో వేగిపోతున్న నా హృదయానికి తృప్తికల్గించు."

"మంజూ, చూడు ఆ జంట ఎంత అందంగావుందో."

"వాడున్నాడు చూశావ్, ఆజానుబాహుడు. కండలు తీరిన ఆ శరీరం చూడు ముద్దులొలికే ఆ ముఖవర్చస్సుచూడు. పొందినా అలాంటివానికి పొందు పొందిన స్త్రీ జీవితమే ధన్యం."

"ఈ లోకంలో గాలి ఎందుకున్నట్టు?"

"తృప్తిగా పీల్చడానికి"

"మరి దేవుడు అందమైన వస్తువులు ఎందుకు సృష్టించినట్టూ?"

"పూరాగా అనుభవించమని"

"దేవుడిచ్చిన జీవితాన్ని, ప్రకృతి ప్రసాదించిన యౌవ్వనాన్ని, పూర్తిగా అనుభవిస్తుంటే విలాసపురుషుడని లోకం నన్ను ఎన్నో ఆడిపోసుకుంటుందేమి?"

"వేడనలేక, అనుభవించడంచేతకాక, అసూయచేత"

"మంజూ, నీకీ తత్వం పూర్తిగా వంటబట్టిందే! నా చేతిలోనే అధికారం వుంటే, నీకు ఈక్షణాన నోబుల్ బహుమానం నీ మొఖాన విసరివేసేవాణ్ణే"

"అఘోరించావుగాని, వివాహ జీవితం వాంఛనీయమా, కాదా, చెప్పకో."

"ఛీ, ఛీ, వివాహమా? ఎందుకు? ఎవరికి? మనిద్దరికీనా! వద్దు. పక్షులకులేని పెళ్ళిళ్ళు, పశువులకులేని పరిణయాలు, మృగాలకులేని వివాహాలు, మానవులకు మాత్రం ఎందుకు?"

"అంతేనా? అయితే పశుపక్ష్యాదులకన్నా మన మేవిధంగా మిన్న?"

"అలా అడుగు చెపుతాను. మానవులం మోసంలో మిన్న. వంచనలో, ఆత్మవంచనలో అందెవేసినవాళ్ళం. ఇంత కన్నా ఇంకేమి కావాలి? పశువులకు, మనకు తేడా అదే భామా!"

మంజువాణి తూలుతూ, శ్రీహరిమీద వాలిపోయింది. తూలుతూనే శ్రీహరి ఆమెను కౌగలించుకున్నాడు. ఇద్దరూ నేలమీద పరచివున్న తివాసీపై వాలిపోయారు.

*　　*　　*

తెల్లవారింది. దూదిపరుపులపైన, 'డన్‌లఫ్‌పిల్లో' పైన పరుండే మంజువాణి కటికనేలపైన కాళ్ళకోసం ఉద్దేశించిన తివాసీపై వళ్ళు తెలియని విధంగా నిద్రపోతున్నది శ్రీహరి ప్రక్కన లేడు. ఎప్పుడో వెళ్ళిపోయాడు పని పూర్తిఅయిన తరువాత కాలహరణం చేయడం అతనికి ఎంతమాత్రం మన స్కరించదు.

కిటికీలోనుంచి చొచ్చుకొచ్చిన ఎండపొడ మంజు వాణి ముఖంమీద పడుతున్నది; ఆమె స్థితినిచూచి వెక్కి రించుతున్నట్టుంది. ఆమెకు మెలుకువ వచ్చిందికాని బద్ధకం వదలలేదు. అటూ ఇటూ దొర్లింది.

శ్రీహరి ప్రక్కన లేడు. ఎప్పుడో లేచి వెళ్ళిపోయాడు.

ఆక్కర తీరింది. కనీసం మంజూను లేపనైనా లేపకుం డానే వెళ్ళిపోయాడు. ఆమె మనస్సు బాధపడింది. తనంటే అతనికి ఇంత హీనదృష్టా?

ఆమె కంటికి మడచిపెట్టివున్న కాగితం ఏదో కన్పిం చింది. "ఫూల్, ఉత్తరం వ్రాసిపెట్టి పోయివుంటా"డని అను కొని ఆమె దానిని తీసుకొని చూసింది. అది బ్యాంక్ చెక్. మదనమోహన్ పేర పాతికవేలకు వ్రాసిపోయాడు. పైగా క్రాస్‌చేసి పోయాడు.

మంజువాణికి మొదటిసారిగా జీవితంపట్ల విసుగుదల, విరక్తి జనించాయి. వేయిమైళ్ళ దూరంనుంచి తనకోసం ఎగిరివచ్చిన మదనమోహనుడిని తాను పన్నెండు గంటల క్రితమే అవమానించి, పంపించింది. ఎందుకోసం? శ్రీహరి సాంగత్యంకోసం? ఏడీ శ్రీహరి? కామవాంఛ తీర్చుకొని, కంటికి కన్పించకుండా పోయాడు.

ఇంత జరిగాక, తాను మదనమోహనుడికి ముఖం చూపడం ఎట్లా? ఇంతకుముందెన్నడూ ఆమె అతనిముందు తలవంచలేదు, ఇక వంచక తప్పదు. ఆమెలో ఆత్మస్థయిర్యం దెబ్బతిన్నది.

జీవితం ఉన్నత పథానికి ఎగరడమైనా, పాతాళానికి పతనంచెందడమైనా ఏదోఒక ఘటనతోనే సంభవంకావచ్చు. గతరాత్రి సంఘటన అలాంటిదే కావచ్చు. ఎవరికి తెలుసు?

నిన్నటివరకు అహంభావంతో, ఆత్మస్థయిర్యంతో గంతులువేసిన మంజువాణియే నేడు మానసిక ఆందోళనతో, దిగులుతో చెప్పనలవికాని వేదన పొందుతున్నది. తన గతి ఏమైపోతుందోనని భయపడుతోంది.

ఆమె ముఖం కళావిహీనమై పోయింది. కళ్ళు పీక్కుపోయాయి. బడలిక స్పష్టంగా ఆమె వదనంలో గోచరిస్తున్నది. ఆమె లేని ఓపికను తెచ్చుకొని తన హోటల్ గదికి బయలుదేరింది.

హోటల్‌కు వెడుతూ దారిలోనే ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది. మదనుడితో ఇక సంబంధాలు త్రెంచుకోక

తప్పదు. ఢిల్లీలోనే ఏదో ఒక ఉద్యోగం చూసుకొని, స్థిరపడిపోవడం మంచిది. శ్రీహరి ఇచ్చిపోయిన చెక్‌ను మదన్‌కు పోస్టు చేయాలన్న నిర్ణయానికి వచ్చింది మంజు. మళ్ళీ మదన్ ముఖం చూడరాదని నిర్ణయించుకొంది.

---

# 11

హోటల్ గదికి చేరగానే మంజువాణికి గత సాయం త్రపు ఘటన గుర్తుకొచ్చింది. కామావేశ వివశురాలైన తాను వళ్ళుతెలియక బంగారంవంటి మదనమోహనుడిని తిరస్కరించి, కర్కశంగా ప్రవర్తించి, రఫీమని తలుపు మూసి వేసింది.

అలాంటి ఘటన జరుగుతుందని మంజుగాని, మదన్ గాని కలలోకూడా ఊహించలేరు.

*　　　*　　　*

జరిగిన ఘటన తలుచుకొంటుంటే, మదనమోహను డికి నిజంగా హృదయం భగ్గున మండుతోంది. ఆడజాతేఅంత అని మనసులో శాపనార్థాలు పెట్టాడుకూడా.

ఆ 'కులట' ముఖం జీవితంలో తిరిగి చూడరాదని నిశ్చ యించుకొన్న మదనుడు వెంటనే ఇంటికి తిరుగు ప్రయాణ మయ్యాడు.

ఒంటరిగా రైలులో కూర్చుని, ప్రయాణంచేస్తూ, ఇంటిలోని ఇల్లాలిని, మంజువాణిని మనస్సులో పోల్చు కుంటూ. మనోనేత్రం విప్పాడు.

*　　　*　　　*

ఆమె మహా సాధ్వి. భర్తను ఏనాడూ నోరెత్తి, చిన్నమాట అనలేదు. అర్థరాత్రి కొంపకు తిరిగి వెళ్ళినా,

ఎంత నిద్రలోవున్నా, లేచి ఆప్యాయతతో ఆహ్వానించి, భర్తకు కావలసిన సదుపాయాలన్నీ చేసి, సకల పరిచర్యలూ పూర్తిచేసి మరీ మేను వాల్చుతుంది. బాధపడుతూకాక, సంతోషంతోనే ఆమె ఆ సేవలు చేస్తోంటుంది. అలాచేస్తేనే ఆమెకు సంతృప్తి.

ఈమె విలాసిని. అంగసౌష్టవానికి వన్నెలు దిద్దుకుంటూ శారీరక సౌందర్యానికి చమక్కులు అతుక్కుంటూ, ఉన్న అందాన్ని పెంచుకుంటూ, లేని శోభను తెచ్చుకుంటూ, పురుషుల హృదయాలను ఆకర్షించే జవరాలు. పురుషుల మనస్సులలో నిద్రాణంగావున్న పశుప్రవృత్తి, మృగతృష్ణను ప్రేరేపించి, మత్తెక్కించి, తైతక్కలాడే వగలాడి ఈమె.

ఆమె పద్ధతే వేరు. సంసారమే స్వర్గం అని భావించే ధర్మచారిణి. ఇల్లు, పిల్లలు, భర్త—ఇంతకు మినహా ఆమెకు మరొక ప్రపంచమే లేదు.

ఈమె తీరే వేరు. స్వసౌఖ్యంకోసం కని పెంచిన తల్లిని, చిట్టి చెల్లిని చిన్నారి తమ్ములను ఊళ్ళో వదిలేసి, వారితో పాటు మానాభిమానాలకు తిలాంజలి అర్పించి, నగరంచేరి, నడమంత్రపు సిరిని చేజిక్కించుకొని, భోగాలు అనుభవిస్తున్న నీచురాలు ఈమె.

* * *

నిన్నటివరకు మంజువాణి మదనమోహనుడికి తలపుకొస్తే, తనివితీరని వలపు పుట్టుకొచ్చేది. కాని ఈనాడు తలుచు

కొంటే, వలపుకుమారు వెగటు, మోజు కలగడానికి మారు అసహ్యం జనిస్తున్నాయి.

క్షణికమైన సుఖాలు ఆశించేవాడు భోగి. ఏదో క్షణాన ఆ భోగే విరాగిగా మారక తప్పదు. అన్ని కాలాలలోను, అన్ని లోకాలలోను ఇదే పునరావృత మాతున్నది. ఇప్పుడూ అంతే జరిగింది.

విపరీతమైన జ్వరంతో బాధపడుతున్న భార్యను, ఆమె చుట్టూ మూగిన స్వంత పిల్లలను ఇంట్లోవదిలి, కామ జ్వర పీడితుడైన మదనమోహన్ ఢిల్లీకి పరుగెత్తాడు. చెప్పుదెబ్బను పోలిన చావుదెబ్బను చౌకబారు స్త్రీ నుంచి పొంది. చింతా క్రాంతుడై, కుపితుడై ఇంటికి తిరిగి వచ్చాడు.

భార్య అంత జ్వరంలోను భర్తకోసం ఎదురు చూస్తున్నది. పిల్లలను సముదాయిస్తూ, లేని ఓపికను తెచ్చుకొంటూ రాని మంచికాలం కోసం తపస్సుచేస్తూ, కాలక్షేపం చేస్తున్నది. దైవాన్ని అడుగుతోంది యింకా అగ్నిపరీక్షలెంతకాలమని. ఆమె తపస్సు ఫలించింది.

మంచినుంచే చెడు పుట్టుకొస్తుంది.

మదనమోహనుడికి మంచి ఆస్తి వుంది. తల్లిదండ్రులు అల్లారు ముద్దుగా పెంచారు. భర్తను మనసారా ప్రేమించి, కుటుంబ సేవ జీవన పరమావధిగా తన ధర్మముగా తలచి ఆదర్శప్రాయంగా, నీతి నియమాలు హద్దులు దాటక ఎంతో నిపుణతతో అత్తమామలకు సేవచేస్తూ, బిడ్డలకు సుశిక్షణ నిస్తూ గృహాన్నే స్వర్గసీమగా చేయగల పాణిగ్రహీత

మనోరమ. తన అదృష్టవశాత్తు లభించింది. దేనికీ వెతుక్కో వలసిన అగత్యం లేదు. వెతలు పొందవలసిన అవసరం అసలే లేదు. దానితో అతను సోమరిపోతు అయిపోయాడు. సుఖాలు మరిగాడు.

మంచినుంచే చెడు పుట్టుకొచ్చింది.

అలానే చెడునుంచీ మంచి పుట్టుకొస్తుంది. మంజువాణి మోసానికీ, అవమానానికీ లోనైన తరువాతకాని అతనికి విలాస జీవితంపట్ల విరక్తి, అసహ్యం కలగలేదు. వివేకోదయం కాలేదు.

మదనుడు ఇంటికొచ్చేసరికి భార్య జ్వరం తగ్గలేదు. పిల్లలు ముగ్గురూ దిగాలు ముఖాలు వేసుకొని, అనాథలవలె కన్పిస్తున్నారు.

భర్తను చూడగానే ఆమె అంత జ్వరంలోనూ, మంచంపైనుంచి లేచింది. మదనుడి హృదయం ద్రవించింది. కనులవెంట అశ్రుధారలు జలజలా రాలాయి. అమాంతంగా భార్యను కౌగలించుకొని వలవల విలపిస్తూ అన్నాడు.

"క్షమించు, నన్ను క్షమించు, మనోరమా."

క్షమకు మారుపేరే భారతీయ స్త్రీ. భారతీయ సాంప్రదాయాలలో పుట్టి పెరిగిన మనోరమ భర్త ఎదురురొమ్ముపై తల ఆన్చి, హీనస్వరంతో దీన గొంతుకతో మెల్లిగా గొణిగింది.

"ఏమిటండీ, ఆ మాటలు?."

మదనమోహనుడి కళ్ళంట కన్నీటిధార ఆగలేదు. అతను ఆక్షణంలో మూగవేదనే అనుభవిస్తున్నాడో లేక నూతన జీవనరాగాన్నే ఆలకిస్తున్నాడో చెప్పడం కష్టం.

"ఊరుకోండి. పదండి భోజనము చేద్దురుగాని"

"ఏమిటీ? నీవు ఈ స్థితిలో వుండి, నాకు చాకిరీ చేస్తావా? పోయి మాటాడకుండా పడుకో" అని గద్దించాడు మదనుడు.

చిరునవ్వు ఆమె ముఖంలో మెరిసింది.

మీ ముఖం చూడగానే నాలోని జబ్బు మబ్బుతెరల వలె విడిపోయింది. ఇక నాకేమీ ఫరవాలేదు. పదండి" అంటూ ఆమె అతని చేయిపట్టుకొని భోజనాల గదివైపు లాక్కుపోయింది.

ఈ దృశ్యాన్ని అమాయకంగా తిలకిస్తున్న పసికందుల ముఖాలు జేవురించాయి.

*　　　*　　　*

ఆ వేళ రాత్రి ఇంటెల్లపాదికీ, కంటినిండా కునుకు పట్టింది. కలతలులేని దాంపత్యం, మనసులు కలిసిన సంసారం నిజంగా స్వర్గధామమే.

మనోరమ వంట్లో స్వస్థత చేకూరింది. తెల్లవారేసరికి, మదనుడికి మంజువాణి దగ్గరనుంచి లేఖ వచ్చిపడింది.

ఆ లేఖను రాసినవ్యక్తి, తన దాంపత్యంలో చిచ్చు రగిల్చిన మహాపాతకి అన్న విషయం మనోరమకు తెలుసు. ఆ ఉత్తరం తీసుకెళ్ళి భర్తచేతికి అందివ్వబోయింది.

ఉత్తరం తీసుకోకుండానే, "ఏమిటో చదువువింటాను" అన్నాడు మదనుడు.

"బాగుంది, మీకు వచ్చిన ఉత్తరం నేను చదవడమేమిటి?"

"ఏం? ఇంకా నన్ను శంకిస్తున్నావా? నీమీద ఒట్టు పెట్టుకొని చెపుతున్నాను. ఇంక నా జీవితంలో పరస్త్రీమీద కన్ను వేయను పరాయి ఆడదానిచెంత జేరను. నీదగ్గర దాయవలసిన రహస్యాలేమీ ఇక నాకు లేవు."

"కాదండీ ఆమె వ్రాసింది"

"ఎవరు? ఆ కులట మంజువాణి రాసిందా? అయితే దానిని తీసుకుపోయి ఆ పొయ్యిలో వెయ్యి."

"అంత తొందరపాటు తగదు. క్రోధంకూడా కామంవలే మానవులకు తాత్కాలికంగా మతిభ్రమణ కలిగిస్తుంది."

"ఆ పాపాత్మురాలిని తలచుకుంటేనే నా ఒళ్ళు మండిపోతుంది. ఈ క్షణాన్నుంచీ నావద్ద దానిమాట ఎత్తకు."

"ఆ కులట పాపాత్మురాలైతే దానిలో భాగము మీకు లేదా? పాపపరిహారము చేసుకోవాలిగా."

"పాపపరిహారము భార్యను క్షమించమనడిగి మనసారా ప్రేమించటమే."

"ప్రేమ రమ్మన్నప్పుడు వచ్చి పొమ్మన్నప్పుడు పోతుందా?"

"రమ్మన్నప్పుడు ఎందుకు వస్తుంది? అట్లా వస్తే ఎప్పుడో బాగుపడేవాణ్ణి. బాగా ఘాటుగా మక్కుగా దెబ్బలు

తిన్న తరువాతే ప్రేమయొక్క నిజస్వరూపము నా మనో నేత్రాలలో అవతరించింది.”

“అబ్బో! మనోనేత్రాలలో ఆ ప్రేమ ఏరూపంలో అవతరించిందో!” అని నవ్వుతూ అన్నది మనోరమ.

“మనోహరమైన మనోరమగానే” అన్నాడు. రసికుడు గదు!

“అయితే అది ప్రేమకాదు కామము.”

“కామాన్నెప్పుడో ఢిల్లీలోనే గోరీకట్టి వచ్చాను.”

“అయితే దానిపైన తాజమహాలువంటి నిర్మాణము చెయ్యాలన్నమాట.”

“అది నీపనే”

“నాపని వేరేవుంది. వానప్రస్థ జీవితానికి తయారు కావాలికదా!”

“ఏం, అది నీకు కష్టమా?”

“గృహస్థానికన్నా నాకదే మేలు” అని చిరునవ్వు నవ్వుతూ అన్న మనోరమ మాటలు అతని హృదయాన్ని రంపమువలె కోశాయి. ముఖము వివర్ణమైంది. భర్త హృదయావేశము తెలుసుకొని మనోరమ తనచేతిలోని జాబు చింపింది. అందులో పాతికవేల రూపాయల చెక్కు మూడు ముక్కలు వున్న వుత్తరం ఉన్నాయి.

“మదనమోహన్ గారికి,

నమస్కారములు.

బహుశా ఈ జీవితంలో ఇంక మీముఖం చూసే యోగం నాకు ఉండకపోవచ్చు. మీ మిత్రుడు మీ పేర

వ్రాసి యిచ్చిన పాతిక వేల రూపాయల చెక్కును ఇందుతో పంపుతున్నాను. స్వీకరించండి. నన్ను మర్చిపోవడానికి ప్రయత్నించండి. మీతో నా పరిచయం నా జీవితంలో ఒక మజిలీ. మరొక మజిలీ ప్రారంభిస్తున్నాను. మరి సెలవు.

—మంజువాణి."

ఉత్తరం చదవడం పూర్తిచేసిన మనోరమ భర్తతో అంది.

"యితరులకు యిచ్చినట్లే ఆమెకును కమీషను పంపండి"

భార్య మాటలు మదనుడికి అర్థంకాలేదు. ఆమె మనస్సు అతనికి అంతుచిక్కలేదు. ఆమె హృదయం ఎన్నో అఖాతాల లోతు కలదా? లేక హిమాలయ శిఖరాలను మించినంత ఉన్నతమైనదా? ఏదీ అతనికి బోధపడలేదు. ఆమెది సాదా మానవ హృదయం అన్న సంగతి అతనికి తట్టనూలేదు.

నాటినుంచి మనోరమ వాక్కు అతనికి సుగ్రీవాజ్ఞ అయిపోయింది.

---



## 12

తెగిన గాలిపటం చందమైంది మంజువాణి జీవితం. ఇప్పటివరకూ వున్న ఆధారం కాస్తా పుటుక్కున తెగిపోయింది. తెగిన గాలిపటం గాలివాటాన్నిబట్టి, ఆకాశంలో ఎగిరి, ఎగిరి, చివరకు ఏ మురికి కూపంలోనో, పెంటకుప్పమీదనో, ఉద్యానవనంలోనో, మరెక్కడో ఒకచోట నేలవాలక తప్పదు గదా!

మంజువాణి గతీ అదే అయింది.

ఆమెదగ్గర డబ్బు కొద్దిగామాత్రమే వుంది. దానిని మందులాగా వాడుకొంటూ, ఆ కర్పూరం హరించక పూర్వమే ఏదైనా బ్రతుకు తెరువు వెతుక్కోవాలి.

పరీక్షా సమయంలోకాని ఎవరి సత్తా ఏపాటిదో ఎవరి శక్తి ఎంతటిదో బయటపడదు. అలాంటి అగ్ని పరీక్షే ఆమెకు ఈనాడు తటస్థించింది.

ఆమె స్మృతి పథంలో 'కైలాసగిరి' తళుక్కున మెరిసింది. చిదంబరం చప్పున గుర్తుకొచ్చాడు.

"నీకు ఎప్పుడు ఏ అవసరం వచ్చినా నా దగ్గరకు వచ్చేయ్; నీకు కావలసిన సహాయం చేస్తాను"—

నిజంగా పిచ్చిపుల్లాయ్—మంజు తనలో తానే నవ్వుకొంది. ఏదో ఆశ చూపి, తనను వలలో వేసుకోవచ్చునని

చూశాడు. ఇక చూపించాలి తన తడాఖా. అతనిలో కామం లేపి, ఆ కామాంధకారంలో కళ్ళు పొగొట్టి. గుడ్డివాడిని చేసి, ఆటలాడించాలి అని తీర్మానించుకొంది మంజువాణి.

"శుభస్య శీఘ్రం" అనుకొని, వెంటనే "ఎక్స్పెడిషన్" ప్రారంభించింది. చక్కగా సింగారించుకొని, కైలాస గిరికి ప్రయాణమైంది.

మంజువాణి కంటపడగానే చిదంబరం కొద్దిగా విస్మయుడయ్యాడు.

"వచ్చావన్నమాట. నేను అనుకొంటూనే వున్నాను. -చెడి బ్రతికినవాళ్ళు, బ్రతికిచెడలేరు అని. ఆపదల్లోవున్నావా? అవసరాలు వుండి వచ్చావా? చెప్పు" అంటూ చిదంబరం ఆమెను ఆహ్వానించాడు.

"నాకు ఆపదలేవీ రాలేదు. కానీ, నీతో అవసరంవుండి వచ్చాను"

"ఏమిటా అవసరం? చెప్పు"

"పదిమందీ వున్న ఈ హాలులో కాదు. పదండి గదికి, చెబుతాను"

ఇద్దరూ కలసి చిదంబరం గదికి వెళ్ళారు. ఇద్దరూ సోఫాలో ఒకరి సరసన మరొకరు ఆసీనులయ్యారు.

"ఏదైనా ఉద్యోగం ఇప్పించండి"

"ఉద్యోగాలు ప్రస్తుతం నాదగ్గర లేవు. ఉద్యోగం కావాలంటే మరెక్కడయినా వెళ్ళి వెదుక్కో."

"మరి మీరు చేసే సహాయం ఏమిటి?"

"ఈ గదిలో నీ ఇష్టం వచ్చినన్నాళ్ళు వుండిపో. ఎంత డబ్బు కావాలో అడుగు, పారేస్తాను."

మంజువాణి అహం దెబ్బతిన్నది. పశువు! ఎంత నీచంగా మాట్లాడుతున్నాడు! తనను పడుపుకత్తె కన్నా హీనంగా చూస్తున్నాడే? సంస్కారం, సరసం బొత్తిగా తెలియని సంపన్నుడు.

ఆమె తన హృదయంలో రగులుతున్న క్రోధాన్ని అణుచుకొంటూ; కార్యసాధనకు, వలపునటిస్తూ, వలపన్నింది.

"మరీ మంచిది. పనీ పాటా లేకుండా, గదిలో కూర్చోపెట్టి పూజిస్తానంటే, వద్దనేవారు ఎక్కడయినా కదా?

"మరి ఆనాడు నా చెంపమీద అంత బలంగా దెబ్బ కొట్టావే! ఆనాటి పతివ్రత ఈనాడు పడుపుగత్తె కావటానికి ఎలా అంగీకరించింది?" అంటూ చిదంబరం ఆమెను కౌగలిలోకి తీసుకోవడానికి ప్రయత్నించాడు.

"ఏదో తప్పత్రాగిన మైకంలో వుండి, వళ్ళు తెలియక, ఆ పని చేశాను. క్షమించండి. అందుకు పరిహారంగా ఆనాడు దెబ్బతో కందిపోయిన మీ చెంపమీద, మధురం చిలికే ముద్దు పెడతాను. ఏదీ".....అంటూ ఆమె చిదంబరం ముఖాన్ని మృదువైన తన హస్తాలలోకి తీసుకొని, ఆ చెంప, ఈ చెంప రెండుసార్లు ముద్దెట్టుకొంది.

చిదంబరం ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. అతనూ ఎందరో స్త్రీలతో సాంగత్యం పొందాడు కాని, ఇంతటి మధురానుభూతిని ఏ మగువా తనకు కల్గించలేదు.

"కాని, మీరు ఒక షరతుకు ఒప్పుకోవాలి. అలా ఒప్పుకుంటేనే మీ దగ్గర వుండిపోతాను."

"ఏమిటో చెప్పు. ఎన్ని షరతులకైనా ఒప్పుకుంటాను. నీకోసం ఏమిచేయాలన్నా చేస్తాను"

"మూడు రోజులపాటు మీరు నన్ను ముట్టుకోరాదు"

"ఏం? మైల పడ్డావా?"

"వంట్లో కులాసాగా లేదు"

"నీ మనస్సుకు హుషారుగా ఉన్నప్పుడే ఖుషీచేద్దాం. నేను పైకి కన్పించేటంత కర్కోటకుడిని కాదు మంజూ"

"ఆ విషయం మీరు ప్రత్యేకించి చెప్పాలా?" అదే అదను అనుకొని, అతనిని గట్టిగా కౌగలించుకొని, అతని పెదాలపై ముద్దులవర్షం కురిపించింది.

అతను నిజంగా ఆమెకు వశుడయి పోయాడు. దాసాను దాసోహం అనడానికి సిద్ధంగా వున్నాడు.

సబలుడనుకొనే పురుషునిలో అంత దుర్బలత్వమేమిటి?

అబల అనుకొనే ఆడదానిలో సబలత్వం ఎక్కడిది?

చిదంబరం ఈ విధంగా పరస్త్రీ వ్యామోహపరుడయి పోవడానికి ప్రత్యేకించి, ఒక కారణం లేక పోలేదు.

అతని భార్య మహా గయ్యాళి. దానికితోడు కాపురానికివస్తూ, మంచి ఆస్తిని తోడుకొచ్చింది. 'కైలాసగిరి' హోటల్‌కు పెట్టుబడి ఆమెదే. దేవుడిచ్చిన నోరు, తల్లిదండ్రులిచ్చిన ఆస్తిపాస్తులు తోడయి, ఆమెను మరింత గడుసుదానిని చేశాయి.

భార్య అంటే చిదంబరానికి మహాభయం. ఆ దంపతు లిద్దరూ వయసులో వున్నారు. కావలసినంత డబ్బు వుంది. హాయిగా బ్రతకవలసిన జంట. కాని, అందుకు వారు నోచుకో లేదు.

చిదంబరం మొదట్లో భార్యనుంచి ఏదో పొందాలని ఆశించాడు. కాని అది అతనికి లభ్యం కాలేదు. అసంతృప్తి మాత్రమే మిగిలింది. భార్యవల్ల పొందలేని ఆనందాన్ని పర స్త్రీలనుంచి పొందవచ్చునన్న ఆశతో, భార్యకు తెలియ కుండా పడతులతో సంబంధాలు ప్రారంభించాడు.

దానితో వారి దాంపత్యం మరింత నరకరూపంగా మారింది.

పాపం శ్రీమతి చిదంబరం కూడా కుమిలిపోతూనే వుంటోంది. 'రంభ' వంటి తాను వుండగా, తన భర్త పరుల కోసం ఎందుకు వెంపరలాడు తుంటాడో. ఆమెకు అర్థంకాదు.

భర్త పాడు బుద్ధివల్లనే అలా జరుగుతున్నదని ఆమె అభిప్రాయం. ఎలాగైనాసరే, ఏమైనాసరే, భర్త పెడమార్గం పట్టకుండా నివారించాలని ఆమె తాపత్రయం.

ఒక దానిని సంకల్పించినంత మాత్రాన, అది తానంతి టదే నెరవేరిపోదు. దానికి నేర్పు కావాలి. అదే ఆమెలో లేదు. ఫలితం ఆ భార్యా భర్తల జీవితాలలో మనశ్శాంతి మరింత కరువై పోయింది.

ఆమె తన భర్త గుండెల్లో భయం పుట్టించ గలిగిందే గాని, ప్రేమను రగిలించలేకపోయింది. గడగడ వణికేటట్లు చేయగలిగిందేగాని, వలపుతో, విరహంతో, విలపించే విధంగా మార్చలేకపోయింది.

శ్రీమతి చిదంబరం నవనాగరికురాలి దుస్తులు ధరించి, హోటల్ ఆఫీసు గదిలో ప్రవేశించింది.

ఖాళీపుస్తకాలు తిరగేస్తున్న చిదంబరం, సబిన్‌స్పెక్టర్ రాగానే గభాలునలేచి, నిలబడి సలాంచేసే కానిస్టేబుల్ మాదిరిగా, కుర్చీలోనుంచి అమాంతంగా లేచి నిలబడ్డాడు.

పెద్దపులిని చూస్తే పసిపిల్లవాడు భయపడినంతగా అతను తన అర్థాంగినిచూసి హడలిపోతున్నాడు.

మంజువాణి దగ్గర అంత ధైర్యంగా మహా రసికుని వలె ప్రవర్తించిన చిదంబరమే భార్య కంటపడగానే, కుక్కిన పేనుగా మారిపోయాడు. న్యాయస్థానంలో నేరస్థుడుకూడా అలా నిలబడడు.

శ్రీమతి చిదంబరం భర్తకు ఎదురుగా కుర్చీలో కూర్చొని, "నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి కూర్చో" అని గదమాయించడంతో, 'ఠఫీ' మని కుర్చీలో కూలబడ్డాడు.

పొయ్యిలో పడుకున్నప్పుడలా కుక్క శపథం చేస్తుంటుందట! ఇక చచ్చినా దొంగతనంగా అన్నపు కుండలో మూతి పెట్టకూడదని, కర్రలు విరిగేటట్టు చావు దెబ్బలు తిన కూడదని.

భార్య ఎదుట వున్నప్పుడు చిదంబరం సరిగా అలాంటి శపథాలు మనస్సులో చేసుకొంటుంటాడు. కాని, వెధవ మనస్సు, వశంలో వుంటేగా? కాస్త అందమైన యువతి కంటపడితే చాలు, మహా తాపం పుట్టుకొస్తుంది. స్త్రీపొందు

కోరితే తప్ప ఆ తాపం చల్లారదు. పాడు దేవుడు ఇలాంటి బాధ ఎందుకు పెట్టినట్టు-అని తనలో తానే ప్రశ్నించు కుంటాడు.

"అయితే, మరొక దానిని దరిచేర్చావన్నమాట. నీకు ఎప్పటికి బుద్ధివస్తుందంట?"

"అదికాదు. పాపం, ఆమె అనాథ. ఉద్యోగం సద్యో గంలేక నానాబాధలు పడుతున్నది. ఆమెను మన కాఫీసెక్షన్ ఇన్‌చార్జిగా వేయవచ్చుగదా అని..."

భర్త చెప్పటం పూర్తికాక మునుపే, ఆమె అడ్డు సవాళ్ళు వేయసాగింది.

"ఆ పేరుతో నీవు జల్సాకూడా చేయవచ్చు. నీ కపట నాటకం నా దగ్గరా?"

"దైవసాక్షి. అలాంటి పాడుబుద్ధి నాకు లేదు. నా మాట నమ్ము. కష్టాలలోవున్న స్త్రీకి కాస్త సహాయంచేయా లన్న దృష్టితప్ప నాకు మరొకటి లేదు."

"చూస్తాగా, పిచ్చిపిచ్చిగా ప్రవర్తించావంటేమాత్రం మర్యాద దక్కదు. సరే, బయలుదేరు. అలా షికారు పోయి వద్దాం"

ఇంతవరకు బడిపంతులువలె పిల్లాడిని గదమాయిస్తూ పాఠాలు నేర్పిన శ్రీమతి చిదంబరం ఇక భార్య పాత్రను ధరించడం ప్రారంభించింది.

చిదంబరానికి పెద్ద చిక్కు వచ్చిపడింది. భార్యతో షికారుకు పోవడం అతనికి మహా చిరాకు.

ఆమె అనురాగం ఒలికిస్తూ, నెమ్మదిగా భర్తకు ప్రక్కగా, కుర్చీ చేయిపై కూర్చుని, తన చెక్కిళ్ళను భర్త చెంపకు నిమురుతూ, అతని జుత్తులోకి తన చేతివేళ్ళను జొప్పిస్తూ, అనునయంగా అంది.

"నీవు చాలా మంచివాడవు చిదంబరం! కాని నీకు అప్పుడప్పుడు బుద్ధి చలిస్తుంది. లేకపోతే, మన దాంపత్యం చూసి ఇతరులు అసూయ చెందేవారుకదూ! పద, నా మాట విను. హాయిగా, కులాసాగా తిరిగొద్దాం. ఎప్పుడూ, ఈ పాడు వ్యాపారమేనా? ఈ జగతిలో వీచే గాలులు, పూచే పూలు, నింగినుంచి తొంగిచూసే నక్షత్రాలు, నీలి ఆకాశం—వీటన్నిటికీ సార్థక్యం చేకూరాలా? ఈ జీవితంలో ప్రతి నిముషాన్ని మధురక్షణంగా మార్చుకోవాలి. మనిద్దరి శరీరాలలో ప్రతి అణువూ ఆనందంతో, తన్మయత్వంతో. జ్వలించాలి. మన హృదయాలు ఆకాశంలో తేలిపోవాలి పద."

చిదంబరం రసికునివలెకాక, బందీవలె బయలుదేరాడు భార్యతో.

---

# 13

"పెద్ద చిక్కు వచ్చి పడింది మంజూ, నీవు తక్షణం ఈ గదినుంచి మరొక గదికి మారాలి"

చిదంబరం అమితమైన భయాందోళనతో కాగి, వేగి పోతున్నట్టున్నాడు. దీనికి కారణమేమిటో మంజువాణికి అర్థం కాలేదు.

"ఏమిటి, మిన్ను విరిగి మీదపడుతున్నట్టు భయపడు తున్నారు?"

"నిజంగా మిన్ను విరిగి మీదేపడుతున్నది. నా భార్య మన వ్యవహారం పసికట్టింది. అసాధ్యురాలు. ఏక్షణంలోనైనా ఇక్కడ ఊడిపడవచ్చు."

చిదంబరం పిరికిగుండె వాడని తెలియగానే మంజు వాణికి విపరీతంగా నవ్వు వొచ్చింది.

"ఏమిటా నవ్వు? నేను నా భార్యకు మాత్రమే కాక, నీకుకూడా చులకన అయిపోయానా? అవహేళన చేస్తు న్నావా?"

"నీవంటి ధీర పురుషుడిని చూచి, చులకన భావంతో అవహేళన చేయకల్గిన సాహసం నా కుంటుందా? ఆ మగువ మాంచాలి ఎవరో, ఎలాంటిదో, తలుచుకొంటూంటే నవ్వు వస్తున్నది. అంతే."

చిదంబరం చెప్పినట్టే, మంజువాణి తన మకాంను మరొక గదికి మార్చింది. ఆ గదికూడా బాగానేవుంది. అన్ని సదుపాయాలు అమరివున్నాయి.

అప్పటికి చిదంబరం గుండెదడ తగ్గింది. ఏక్షణాన అయినా ఊడిపడవచ్చు ననుకొన్న శ్రీమతి చిదంబరం ఇంకా ఊడిపడనేలేదు.

చిదంబరం మంజు గదికి వెళ్ళాడు.

"అన్నట్టు, నీవు ఊరికే వుండడానికి వీలులేదు. కాఫీ సెక్షన్ మేనేజరు పదవి ఖాళీకాబోతున్నది. దానిలో జేరు."

చిదంబరం చపలచిత్తం అర్థంచేసుకోలేక పోతున్నది మంజువాణి. క్షణానికొకమాట, ఇలాంటి వాడితో వేగడం చాలా కష్టం.

ఉద్యోగం యిప్పించ మంటే, ఊరికే ఉండమన్న చిదంబరమే, ఊరికే ఉంటానంటే ఉద్యోగం చేయక తప్పదంటున్నాడు.

"మీదగ్గర నేను చచ్చినా ఉద్యోగం చేయను; చేయలేను."

"అలా అంటే ఎలా మంజూ? నా భార్య పోరుపడలేక నిన్ను నామకః ఉద్యోగంలో పెట్టక తప్పడంలేదు."

"కాఫీ గొడవ నాకేమీ తెలయదే. తెలియని దానిని నిర్వహించడం కష్టమే."

"నీకేమీ తెలయవలసిన అవసరంలేదు. ఆ మాటకొస్తే ఇప్పటివరకు ఆ సెక్షన్ చూస్తున్న విజయకు మాత్రం ఏమి తెలుసు? ఆమె అందగత్తె. ఇక్కడ ఉద్యోగంచేస్తే యువ

తులకు, వచ్చేపోయే పురుషులతో మసలుకోవడం తెలుస్తే చాలు."

"అయితే మీరు ఆడవాళ్ళ అందాన్ని ఎరగావేసి వ్యాపారం చేస్తారన్నమాట."

"ఆడవాళ్ళు మాత్రం తక్కువ తిన్నారా! విజయ మట్టుకు విజయ, ఇక్కడ చేరిన తర్వాత ఇక్కడకు వచ్చే పోయేవారిని ఎరవేసి, కనీసం అర లకారమైనా సంపాదించి వుంటుంది."

ఆ విషయాలన్నీ వింటుంటే మంజువాణికి మతిపోతోంది. జీవితంమీద వెగటు కలుగుతోంది. ఏమిటీ పాడు లోకం? తొందరగా ప్రళయమొచ్చి, ఈ వెధవ ప్రపంచాన్ని ఎత్తుకుపోతే బాగుండును.

ఆమె ఆలోచించింది. ఆపద్ధర్మంగా చిదంబరం చెప్పినట్టు నడుచుకోవడం మినహా ఆమెకు మరొక దారిలేదు. కొంతకాలం 'కైలాసగిరి'లో కాలక్షేపంచేస్తూ, మంచిఉద్యోగమేదైనా చూసుకొని, ఈ యమకూపంనుంచి బయట పడాలని తీర్మానించుకొంది.

"అయితే, విజయను బయటకు సాగనంపుతున్నారన్న మాట నా కోసం?"

"నీ కోసంకాదు చిలుకా, నా భార్యపోరు పడలేక. ఆమెకు నాకు సంబంధం వున్నదని నా భార్య గ్రహించబట్టి ఈ ఉపద్రవం వచ్చిపడింది."

"అంటే, విజయ నీ ప్రియురాలా?"

"ఏం! నీవు అసూయపడుతున్నావా?"

"అసూయ దేనికి? అసహ్యించుకొంటున్నాను"

"అవునులే, ప్రతి ఆడదాని తంతూ ఇంతే. తాను తప్ప మిగతావాళ్ళంతా నీచులని, పతితలని భావించుకొంటారు. భామినీమణులంతా చివరకు వేశ్యకూడా తోటి ఆడదానిని నీచంగానే చూస్తుంది.

"వేశ్య ఆపని చేయకపోతే, తన మచ్చ దాచుకోలేక పోతే, పురుషుల మనస్సు దోచుకోలేదు."

"మహా బాగాపలికావులే కొలికీ, మరి విజయ స్థానంలో నీవు రేపే ప్రవేశించు. మనిద్దరం విజయులం. మన దెబ్బకు ఎదురేవుండదు. ఒకే దెబ్బకు రపీమని రెండు పిట్టలు రాలిపోతాయి. నాభార్య అనుమానం తీరిపోతుంది. ఈమధ్య విచ్చలవిడిగా, ప్రియులతో కులుకుతూ నన్ను చిన్నచూపు చూసిన విజయ తిక్క వదులుతుంది."

"విజయ తిక్క ఎందుకు వదులుతుంది? హాయిగా నిశ్చింతగా మరొకచోట సంపాదించుకొంటుంది. ఏం? మీ హోటల్‌లో ఉద్యోగం లేనప్పుడు ఆమె బ్రతకలేదా? నీ కొలువు వూడినా, ఆమె వంటిలో సొగసు, సత్తువ తగ్గనంత వరకు ఎక్కడైనా చలామణి కాగలుగుతుంది."

"స్థానమహిమ ఎలాంటిదో నీకు తెలియదు సుందరీ? ఇప్పుడు కాకపోయినా ఒకప్పుడయినా ఆ విషయం నీకు తెలిసి రాకపోదులే."

"మీరేమో చపలచిత్తులు, మీ భార్య మహా గడుసుది. మీ రిద్దరుకలిసి నన్నేమిచేస్తారోనని నాకు భయంగా వుంది చిదంబరంగారు."

"భయం అనవసరం, అభయమిస్తున్నాను. నా బొందిలో ప్రాణంవుండగా, నీవంటిమీద ఈగనుకూడా వాల నీయను. చివరకు నా భార్య వచ్చినా నిన్ను రక్షించే పూచీ నాది."

"మీ పురుష వాగ్దానాలను నమ్మిందెవరు? నమ్మి బాగుపడిన ఆడది ఇలలోవున్నదా? ఏమో అనుమానమే."

"ఇంతకీ ఉద్యోగం చేస్తావా? లేదా! చెప్పు" అని చిదంబరం మంజువాణిని నిగ్గదీశాడు.

"మీరంతిగా చెప్పుతుంటే చేయకతప్పుతుందా మరి?"

"నేను చెప్పినట్లల్లా ఒప్పుకుంటావా?"

"ఒప్పుకోక అబలలు చేయగల్గిందేమిటి?"

"అన్నట్లు చెప్పడం మరిచాను, ఈ హోటల్‌లో పని చేసే ఆడవాళ్ళందరికీ దుస్తులధారణ వ్యాపార సరళిలో నిర్ణయమైంది."

"నేను దేవతా వస్త్రాలు ధరించాలా?"

"చక్కగా ఊహించావు, మంజూ! చూడగా నీవు అసాధ్యురాలవే. ఆవులిస్తే ప్రేవులు లెక్కపెడతావు?"

"మీరు చెప్పినట్టు దేవతా వస్త్రాలు ధరించి, అంగ విన్యాసంచేసే అంగనలకు ప్రత్యేకమైన పారితోషికం ఇప్పించే ఏర్పాటు ఏమైనా చేశారా?"

"అది ఉద్యోగ నిబంధనలలో ఒకటి."

"సరే; మీరు చెప్పినదానికి ఎదురాడ గల్గిన స్థితిలో నేను ఇప్పుడు లేనుగా."

ఇంతలోకి వెయిట్రెస్ లలితవచ్చి, "మిమ్మలను అమ్మగారు వెంటనే రమ్మంటున్నది" అని చిదంబరానికి నివేదించింది.

మారు పలకకుండా గంభీరంగా వెళ్ళిపోయాడు చిదంబరం.

"కాఫీ శాఖకు కొత్త మేనేజరు మీరేనా"

"ఏం నేనే" అన్నట్టు మంజువాణి ఆమెవైపు నిర్లక్ష్యమైన చూపు విసిరింది.

"మీబోటివారు ఇక్కడ ఆట్టే కాలం ఉద్యోగం చేయలేరమ్మా."

శుభం పలకమంటే, తనవలె వెయ్యేళ్ళు వర్ధిల్లమని దీవించిన విధవ కథ గుర్తుకొచ్చింది మంజువాణికి.

"ఇంతకీ నీవు ఇక్కడ ఏమివని చేస్తుంటావు"

"ఫలహారశాఖలో వెయిట్రెస్ ఉద్యోగం"

"చిదంబరంగారి భార్య అంత గడుచురాలా? మహా కర్కోటంగా వ్యవహరిస్తోందటగా, నిజమేనా?"

"వట్టిదండి. ఆమె చాలా మంచిది."

"అయితే, చిదంబరానికి ఆమెకు పడకపోవడానికి కారణమేమిటి?"

ఈ ప్రశ్నకు ఎలాంటి సమాధానం చెప్పాలో లలితకు బోధపడలేదు. ఏమి చెప్పితే ఏం ముప్పో?

"అది చెప్పితే అర్థంకాదండి. స్వయంగా గ్రహించవలసిన విషయం. అనుభవంలో మీరే గ్రహిస్తారుగా?" అని ముక్తసరిగా ముగించి, ఏదో పనివుందని చెప్పి, లలిత బయలు

చేరుతూ, మంజువాణి అందచందాలను పొగడుతూ ఒక మాట విసిరిపోయింది.

మంజువాణి మురిసిపోయింది.

స్త్రీలోని ముఖ్యమైన బలహీనతే అది. "నీవు అందంగా వున్నా"వంటే చాలు. ఏ స్త్రీ అయినా అన్ని విషయాలు మరిచిపోయి ములగకొమ్మనెక్కి కూర్చుంటుంది. అందులో ఆ మాట తోటి స్త్రీ నోటినుంచివస్తే మరీ మురిసిపోతుంది.

మంజువాణి అద్దంముందు నిలబడి తన శరీరసౌష్టవాన్ని తానే చూసుకుంటున్నది. ఇంతలోకి ఆమె ప్రతిబింబం ప్రక్కనే మరొక ప్రతిబింబం సాక్షాత్కరించింది. ఆమెకూడా అందాల బరిణే. సిగరెట్లు కాలుస్తూ, రైలు ఇంజన్‌లాగా పొగలువదలుతున్న సుందరాంగి. హఠాత్తుగా ఊడిపడిన ఆ స్త్రీలో హృదయం నిజంగా రైలు ఇంజన్‌వలెనే మంచి కాకలో వున్నట్టున్నది. క్రోధావేశఛాయలు ఆమె ముఖంలో ద్యోతకమౌతున్నది.

మంజువాణి వెనుతిరిగి చూసింది. శ్రీమతి చిదంబరం కోరచూపులు విసరుతున్నది. ఎందుకో ఆమెకు తనంటే అంత కోపం? తాను చేసిన పాపం ఏమిటి? మంజువాణికి అర్థం కాలేదు.

"నమస్కారమండీ, రండి కూర్చోండి" — మంజువాణి శ్రీమతి చిదంబరాన్ని సగౌరవంగా ఆహ్వానించింది.

పొంగుకొస్తున్న కోపతాపాలను అణచుకొంటూ, శ్రీమతి చిదంబరం నోరు విప్పకుండా వచ్చి సోఫాలో కూర్చుంది.

"కాఫీ సెక్షన్ కొత్త మేనేజర్‌వి నీవేనా?"

"ఔనండీ"

"నీకు వివాహమైందా?"

"లేదండీ"

"ఏం? ఇంకా కాలం రాలేదనా, పెళ్ళిచేసుకోకుండా ఆగావు?"

"కాలం కర్మ రెండూ కలిసిగానందున, కళ్యాణం కాలేదు."

"అయితే తగిన వరుడు దొరికితే పెళ్ళి చేసుకొంటావా?"

"తప్పుతుందా మరి?" అంటూనే మంజువాణి సూటి సమాధానం చెప్పకుండా తప్పుకుంది.

ఫరవాలేదు. పిల్ల మంచి లైనులోనే వుందన్న అభిప్రాయం శ్రీమతి చిదంబరానికి కల్గింది. విజయవంటి కులట కాదులే అన్న సంతృప్తి ఆమెలో తొంగి చూసింది.

"నీకు ఈ గదిలో అన్ని సదుపాయాలు అమరి వున్నాయా? లేక లోటేదైనావుంటే చెప్పు."

శ్రీమతి చిదంబరం ఆదరానికి మంజువాణి హృదయం కృతజ్ఞతా భావంతో నిండిపోయింది.

"గదిలో సదుపాయాలకు ఎలాంటిలోటూ లేదండీ."

"సరే, జాగ్రత్తగా నీపని నీవు చూసుకుంటూ, చేసుకుపో. వృద్ధిలోకి రాగలవు" అంటూ శ్రీమతి చిదంబరం మంజువాణిని దీవించి, వెళ్ళిపోయింది.

శ్రీమతి చిదంబరంపట్ల మంజువాణికి నిజంగా గౌరవ భావమే ఏర్పడింది. ఆమె పడుతున్న హృదయవేదనను మంజువాణి అర్థంచేసుకోగల్గింది. సాధ్యమైతే ఈ జంట దాంపత్యంలో వసంతాన్ని వర్షించాలన్న బుద్ధి ఆమెకు కల్గింది.

శ్రీమతి చిదంబరం వెళ్ళిపోవడంచూసి, చిదంబరం మంజువాణి దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. ఏమైనా గలాభా బరిగిందేమోనని అతను భయపడ్డాడు.

"ఏమన్నా గొడవ జరిగిందా?"

"మంచివాళ్ళు ఎప్పుడూ గొడవలకు దిగరు" అంది మంజువాణి. చిదంబరం పొందిన అనవసరమైన ఆందోళనకు లోలోపల నవ్వుకుంటూ.

"బ్రతికి పోయాము. అయితే మన వ్యవహారం నా భార్య పసికట్టలేదన్నమాట. మనలను శంకించటంలేదని తేలిపోయింది."

"మన వ్యవహారం ఏమిటి చిదంబరంగారూ?"

"నన్ను 'గారూ' అని సంభోధించవలసిన నోరుకాదు నీది".

"మరి ఏమని పిలవమంటారూ?"

"చిత్ అనో చిద్ అనో పిలిస్తేమేలు. అదేచాలు."

"చిత్ అంటే మీరు చిత్తు అయిపోతారు జాగ్రత్త"

"బెదిరిస్తున్నావా? ఆడవాళ్ళ బెదిరింపులకు నేను హడలిపోతాననుకున్నావా? అసంభవం."

"చూస్తావుగా!"

"ఆ గొడవకేమివచ్చెగాని, సింగారించుకొని సిద్ధంగా వుండు. షికారుకు వెళ్ళొద్దాం."

మంజువాణికి పెద్ద చిక్కేవచ్చిపడింది. కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం. ఈ మానసిక సంఘర్షణ పర్యవసానం ఏమౌతుందో? మంజువాణికి భయం గానేవుంది.

"మరి మీ భార్య కంటపడితే?"

"మన వ్యవహారం కనిపెట్టడం ఆమె తరంకాదు. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేశాను"

"మీరు అంతగా అంటే నేను చెప్పగల్గిందేమివుంది. బ్రతుకు తెరువుకోసం నీ దరిచేరిన దానిని. పాలముంచినా నీట ముంచినా నీవే."

సంతోషంతో గంతులేస్తూ వెళ్ళిపోయాడు చిదంబరం, రాబోతున్న మధురక్షణాల మాధుర్యాన్ని ఊహిస్తూ.

---

# 14

మంజువాణికి దిక్కుతోచడంలేదు. తాను వచ్చివచ్చి, అడకత్తెరలో చిక్కుకున్నట్టయింది. ఇటుచూస్తే చిదంబరం, అటుచూస్తే శ్రీమతి చిదంబరం. ఇద్దరూ ఇద్దరే. అగ్ని పర్వతాలు. అసంతృప్తి జ్వాలలు రగులుకొంటున్న అగ్ని పర్వతాలు. ఆ రెండింటిలో ఏదో ఒకటి ఏ క్షణానఅయినా బద్దలు కావచ్చు. ఆ రెండిటి మధ్య నిలచిన తన జీవితం బూడిదపాలు కావచ్చు.

ఆమెకు అక్కడ వుండడమంటే భయం; వెళ్ళిపోవాలన్నా భయంగానేవుంది. ఎక్కడికెళ్ళుతుంది? ఢిల్లీలో తాను ఎక్కడ ఉద్యోగం చూసుకుంటుంది!

మంజువాణి ఎటూ తేల్చుకోలేక సతమతమైపోతున్నది.

ఈలోగా రానేవచ్చాడు చిదంబరం. వెంటనే బయలుదేరమన్నాడు. బలవంతంచేశాడు.

ఇష్టంలేకపోయినా మంజువాణి బయలుదేరక తప్పలేదు.

టాక్సీలో చిదంబరం ప్రక్కనే కూర్చొని మంజువాణి గతాన్ని గురించి తలపోస్తున్నది. అతను ఏవేవో ప్రశ్నలు వేస్తూ ఆమెను విసిగిస్తున్నాడు.

"పలకవేమే చిలకలకొలికీ!" అంటూ అతను ఆమె భుజాలు పట్టుకొని, కుదిపి మరీ ప్రశ్నించాడు. అప్పటికి కాని ఆమె ఊహా ప్రపంచంలోనుంచి ఈ లోకానికి రాలేదు.

"నీ విషయమే ఆలోచిస్తున్నాను. కంటికి నదురుగా కన్పించే ఆడదాన్ని చూడగానే నీకింత వెర్రెత్తిపోతుందే! దానికి కారణ మేమిటా అని ఆలోచిస్తున్నాను."

"అది ఆలోచిస్తే అర్థంకాదు మంజూ, ఆ రాకాసిని ఏ శుభముహూర్తాన మెడకు కట్టుకున్నానోగాని, ఆ క్షణం నుంచి నేను పడుతున్న బాధ యింత అంత కాదు."

"ఆమెను నీవు సరిగా అర్థంచేసుకోలేకపోతున్నావు. నిన్ను అమితంగా ప్రేమిస్తున్నది, అందుకే నీవు పరస్త్రీతో మాటాడినా సహించలేక పోతున్నది."

"వట్టిది. అంతా నటన. నామీద ఆమెకు ప్రేమలేదు. నన్నొక ఆటవస్తువునుచేసి ఆడించడం ఆమెకు మహా సరదా. గీసిన గిరి దాటరాదని ఆమె ఆజ్ఞ. వంట్లో చీము, నెత్తురున్న వాడు అందుకు ఆమోదించలేడు."

"మీ ఇద్దరికీవచ్చిన లోటు ఏమిటి? హాయిగా జీవించ డానికి కావలసినంత డబ్బుండె. ఈడూ, జోడూ కుదిరిన దంప తులు. మీ దాంపత్య జీవితాన్ని ఎందుకు ముళ్ళకంచెగా మార్చుకుంటున్నానో అర్థంకావడంలేదు!"

చిదంబరానికి ఇదంతా చికాకుగావుంది.

"పోనిద్దూ వెధవ గొడవ. ఆబాధ, వ్యధలనుంచి పోదామని, నీచెంత జేరితే, ఏమిటీసొద?" అని విసుక్కు న్నాడు.

"వీల్లేదు నీ సంసారం బుగ్గిపాలు కావడానికి నేను అంగీకరించను. ఆమె చాల మంచిది."

"ఏమిటో ఆ మంచి? ఆమెను చూస్తేనే నాకు పులిని చూసినంత భయంగా వుంటుంది; ఎందుకో నాకు తెలియదు. నేను ఆమెను ప్రేమించడంమాట దేవుడెరుగు. కనీసం కామించనైనా లేను."

"నీవలెనే ఆమెకూడా పరాయి పురుషులతో జల్సాగా తిరగడం ప్రారంభిస్తే - నీవు ఏమనుకొంటావ్? ఆలోచించు."

"అలా జరగాలని దేవుడికి ఎన్నోసార్లు మొక్కుకున్నాను. కాని, ఆపాడు దేవుడు నా ప్రార్థనలు ఆలకిస్తేనా?"

"నీచుడా!"

మంజువాణి అప్రయత్నంగానే చిదంబరాన్ని దూషించింది. అందుకు అతను మనస్సు చిన్న బుచ్చుకొనలేదు.

నిజమే. చిదంబరం నీచుడేకాకపోతే, తన భార్య పరపురుషుడితో సంబంధాలు పెట్టుకోవాలని కోరుకుంటాడా? కాని, ఈ సంఘంలో అలాంటి నీచులూ వున్నారు.

టాక్సీ "గే లేడీస్" ముందు ఆగింది. ఇద్దరు కారుదిగి లోపలకు వెళ్ళారు.

మంజువాణి వద్దంటున్నా, చిదంబరం ఎన్నో పదార్థాలను ఆర్డరిచ్చాడు. వారిద్దరు పొట్టనిండా మెక్కారు. తప్ప తాగారు, ఈ ప్రపంచాన్నే మర్చిపోయారు. వారి మనస్సులలో దాగివున్న మృగప్రవృత్తి విశ్వరూపంధరించింది.

"దేనికైనా సాహసం కావాలి. మధురవాణీ! చూడు నీలాంటి వాళ్ళంటే నాకు అందుకే మహాప్రీతి. మా ఇంటి

దగ్గర పీనుగవుంది చూశావు, అది వట్టి చవట, సీలాగా పురుషులతో కులికే ధైర్యం, సాహసంలేక మతిపోతుంది. అలా అని దాని నొసట రాసేశాడు. ఆ గాడ్. వెరీ గుడ్ గాడ్."

"నోర్మూయ్, చిత్"

చిదంబరం అమాంతంగా మంజువాణిమీద పడి ఆమె నోరు గట్టిగా మూశాడు.

"ఇదేమిటీరా ఫూల్ నా నోరుమూస్తావేమిటి?"

"కంపు కంపు! బయటకురాకుండా మూశాను."

ఇంతలోకి ఏదో ఫ్లాష్‌బల్బ మెరుపులాగా మెరిసింది.

ఎవరో ఫోటో గ్రాఫర్ ఆ దృశ్యాన్ని ఫోటో తీసేశాడు.

అంత మత్తులోను మంజువాణికి ఏదో భయం వేసింది. తను, చిదంబరం ఒళ్ళు తెలియక, ప్రవర్తిస్తున్నారన్నసంగతి స్ఫురణకు వచ్చింది. ఏమి కొంపలంటుకుపోతాయో? కర్మం చాలకవారు ప్రెస్ ఫోటోగ్రాఫర్ అయితే? తెల్లవారేటప్పటికి తమ ఫోటో పత్రికలకెక్కుతుంది. ఆ ఫోటో ఎన్ని పరిణామాలను ఉపద్రవాలను తెచ్చిపెడుతుందో ఎవరికెరుక?

చిదంబరానికి ఇవేమీ పట్టలేదు. తన ధోరణిలో తాను వున్నాడు. చిలిపి చేష్టలు చేస్తూనే వున్నాడు.

ఇక అక్కడ వుండడం మంచిదికాదని మంజువాణికి తోచింది. వెంటనే లేచింది. తాను తూలుతూనే, తూలిపోతున్న చిదంబరం రెక్కపట్టుకుని బయటకు దాటిసింది.

చిదంబరం మారాము చేస్తున్నాడు. మంజువాణి అతనిని బుజ్జగిస్తూ, ఎలాగో "గే లేడీస్" నుంచి బయటకు తీసుకు రాగల్గింది.

వారిద్దరు 'టాక్సీ' ఎక్కారు. అది తుర్రున బయలు దేరింది. "ఆక్సిడెంట్" తప్పదా అన్నంతమహా వేగాన.



# 15

ఉదయం మంజువాణి హోటలులో తనపని ఆరంభించింది. తెల్లవారి శ్రీమతి చిదంబరం రెండు మూడుసార్లు హాల్లో కనబడింది. చిరునవ్వు నవ్వింది. రాత్రి సంగతి ఎరుగదు గాబోలు. అని సంతృప్తిపడింది మంజువాణి. కాని తరువాత తాను యథాలాపంగా ఏవో పత్రికలు చూస్తూవుంటే రాత్రి హోటలులోని బొమ్మ కనబడింది. 'అమ్మో' అని భయపడి రెండు క్షణాలు గజగజ వణికింది. ఏమీ ఎరుగనట్టు తనపని తను చేసుకుంటూవుంది. చిదంబరం ఆయన భార్య ఈపత్రిక చూచారో లేదో. ఉదయంనుండి చిదంబరం ఎక్కడా కనబడలేదు.

సాయంత్రం తనపని ముగించి ఆఫీసు ముయ్యబోయినప్పుడు చిదంబరం నవ్వుతూ ఎక్కడనుంచో వచ్చాడు.

తన ఆఫీసు దగ్గరకువచ్చిన తరువాత మెల్లగా "పత్రికలో ఫోటోపడ్డది చూచావా ?" అన్నది.

"ఆ చూచాను."

"మరి నీభార్య చూచిందా ?"

"ఏమో తెలియదు. తనకు నా విషయం ఏమి సంగతులు తెలుసో, ఏమి తెలియదో చెప్పుట చాలా కష్టం. ఒకొక్కప్పుడు ఏదైనా అలాంటి విషయం తెలిస్తే వెంటనే

ఒక తుఫాను లేవదీస్తుంది. ఒక్కొక్కప్పుడు ఏమిచేసినా ఎన్ని చేసినా ఏమిమాటాడకుండావుంటుంది. అన్నిటికి బదులు ఒక్కసారి వుపద్రంగా వచ్చిపడుతుంది."

"అవును తుఫాను లేవదీసినా లాభంలేదని తెలుసుకొని, పది తప్పులుకలపి ఒక్కసారి గోలచేస్తుంది."

"ఊఁ చేస్తుంది చేస్తుంది, వంకాయపులుసు! దానివల్ల తనకి లాభమేమిటి?"

"పాపము ఆమెకు లాభమూలేదు, నష్టమూలేదు. నీకు ఇంత మందమైనతోలు ఏర్పడిందిగనుక ఆమె ఏమీ చెయ్యలేదు."

"లేకపోతే ఆమె మహా నాకేమిచేస్తుంది, ఆమె చెప్పుచేతుల్లో వుంటానా?"

"ఏ భార్యా భర్తను చెప్పుచేతల్లో పెట్టుకోవాలనుకోదు. చెడిపోతున్నాడని సన్మార్గంలోకి తిప్పాలని ప్రయత్నం చేయవచ్చు."

"అబ్బో, ఆమె సన్మార్గంలోకి తిప్పాలంటే తిరుగుతానూ?"

"అది నీ ఖర్మ. చెట్టు చెడిపోయేకాలానికి కుక్కమూతి పిందెలు."

"చాల్లే నీ సుమతీశతకాలు" అంటూ వెళ్ళిపోయాడు 'దౌర్భాగ్యుడు' అని అనుకుంటూ ఆఫీసుమూసి సావకాశంగా తనగదికి వెళ్ళుతుండగా చిదంబరం భార్య వచ్చింది.

"ఇలాంటి దుస్తులు పనిచేసేటప్పుడు వేసుకుంటే ఏమీ మర్యాదగా లేదు."

మంజువాణికి కోపంవచ్చింది. "నే నెలాంటి చీరెలు కట్టుకుంటే ఈమె కేమి?"

"నేను అధికారుల ఆజ్ఞప్రకారం ఈదుస్తులు ధరించాను."

"అలాగా"

"మరిమీకు అయ్యగారు చెప్పలేదా?"

"ఆయన నాతో ఏమీ చెప్పరు. నేను భార్యనేగా!"

"ఓహో!"

"సరే. నేను మీ అయ్యగారితో చెప్తాను. చూడు వాళ్ళందరూ నీ వేషంచూచి నవ్వుతున్నారు. మీ అయ్యగారికి ఇలాంటి విషయాలు తెలుసుకునేబుద్ధి, విచక్షణాజ్ఞానం లేదుగనుక చెప్పుతున్నాను. కాని నీవు మర్యాదగావుండే బట్టలు కట్టుకో."

"అలాగేనమ్మా" అని తన గదికి దారితీసింది. ఆమెకు చాలా కోపము వచ్చినట్టున్నది. ఆమె ఆగలేకపోయింది కాబోలు. వెంటనే ఆవిడ చిదంబరం ఆఫీసులోకి వెళ్ళింది. పెద్ద పెద్దగా కేకలు వినబడ్డాయి.

ఏ విషయంలోనూ మితం తప్పకూడదు. ఇరకాటంలో పెడితే, చివరకు పిల్లికూడా తిరగబడుతుంది.

చిదంబరం విషయం అంతే జరిగింది.

సంవత్సరాల తరబడి అతని హృదయంలో దాచుకొంటున్న ద్వేషం భగ్గున మండింది. ఇంతవరకు భార్యను చూస్తే పిల్లిగా మారిపోయే చిదంబరం ఇప్పుడు సింహంగా మారిపోయాడు. ఉగ్రరూపం ధరించాడు.

ఒక అరగంట తరువాత హోటల్ బోయ్‌తో ఒక చీటీ పంపాడు:

"ఈ హోటలు యజమాని నేనుగాని, నా భార్యకాదు. నా ఆజ్ఞ ప్రకారం నీవు వస్త్రములు ధరించవలయును."

"సరే వెళ్ళ"మన్నది మంజువాణి హోటలు కుర్రాణ్ణి. అన్ని అవలక్షణాలతోపాటు ఈతనికి అధోగతి, అభిమానం కూడాను! నాకు వాళ్ళగొడవెందుకు అని భోంచేసి నిద్రపోయింది. కాని ఆనాటినుండి చిదంబరం ఎప్పుడుబడితే అప్పుడు మానాభిమానములులేకుండా బాహాటంగా, ధైర్యంగా ఆమె గదిలోకి రావటం ఎంతో పరిచయంగా మాట్లాడటం మొదలు బెట్టాడు. భార్యకు భయపడలేదు సరికదా లోకానికికూడా భయపడలేదు. ఇంతవరకు దున్నపోతు చర్మమైతే ఇప్పుడు ఏనుగు చర్మములా బండబారిపోయింది. హోటల్లో వాళ్ళందరూ గుసగుసలు మొదలుబెట్టారు. మంజువాణి యిది గ్రహించకపోలేదు. చిదంబరానికి మాత్రం లెక్కలేకుండా పోయింది. అంతే. ఒకరోజు ఆమెతో అన్నాడు:

"ఈవేళ నా భార్యతో చెప్పేశాను మనసంగతి."

"ఏమి చెప్పావు?"

"నీకూ నాకూ సంబంధమున్నదని గోలచేసింది. అవును వుంది-నాకు మంజువాణి కావాలన్నాను."

"అలా ఎందుకన్నావు?"

"ఎందుకు అనకూడదు?"

"మనకేమి సంబంధమున్నది. ఒళ్ళు తెలియకుండా మాట్లాడుతున్నావ్."

"నేను త్రాగి మాట్లాడలేదు. నీవుకూడా తప్పులు పట్టవద్దు. నేను ఎంత బాధపడుతున్నానో నీకేమి తెలుసు? నన్ను ప్రేమించి నాకు ఆనందమివ్వు."

"సరేబాబూ. అలాగే నిన్ను ప్రేమిస్తున్నానుగా! కాని తరచుగా నా గదిలోకి రావద్దు. కామాంధకారములో పడి విచక్షణా జ్ఞానాన్నే పోగొట్టుకున్నావు. ఉపద్రవము ఏమీ తెచ్చి పెట్టకు."

"సరేలే కొలికీ!"

---

# 16

మంజువాణికి ఏదో పనుండి మేనేజరు గదివద్దకు వెళ్ళింది. తలుపు తట్టుదామని తలుపు దగ్గరకు వెళ్ళేసరికి ఏమిటో మాటలు పెద్దగా వినబడినవి. అవి వింటూ తలుపు తట్టకుండా అలా నిలబడిపోయింది.

"క్షమించు" చిదంబరం కాబోలు అంటున్నాడు.

"ఏమిటి క్షమించేది! ఎప్పటి కప్పుడు ఏదో వెధవ పని చేసేది, తరువాత క్షమించ మనటం నీకొక ఆటైపోయింది."

"అవును. బుద్ధి తక్కువై నిన్ను క్షమించమని ఎప్పటి కప్పుడు అడగటమైంది. అందుకే నీకలుసయి పోయాను."

"నీవు అలుసు అయిపోయిన దేమున్నది? నీ కిష్టమొచ్చి నట్లు వూరేగుతూంటివిగా!"

"నా యిష్టం వచ్చినట్లు నేను వూరేగుతాను. నీవెవ్వరు నాకు చెప్పేది? నా యింటిలోనుంచిపో" అని గట్టిగా కొట్టుతూ చిదంబరం తలుపుతీసి భార్యను బైటకు నెట్టాడు. అక్కడ మంజువాణి వుండటం చూచి. "ఏం ఎందుకొచ్చావిక్కడికి?"

"మీరు బాగా త్రాగి వళ్ళు తెలియకుండా వున్నట్లున్నారే!"

"నీవు నా శ్రేయోభిలాషివి. స్నేహితురాలవు అనుకున్నాను. మీ రిద్దరూ ఏకమైనారన్నమాట."

"మేమేమీ ఏకంకాలేదు. మీరిద్దరే ఏకమవండి" అని భార్య కోపంగా అన్నది.

"ఈ వరండాలో ఎందుకు ఈ ఉచిత ప్రదర్శనం" అంటూ మంజువాణి గదిలోకి నడిచింది. వాళ్ళిద్దరూకూడా లోనికి వెళ్లారు.

"అమ్మా! నాకూ నీ భర్తకూ ఏమీ సంబంధంలేదు. మాకేదో సంబంధమున్నదని భ్రమపడి మీరు బాధపడు తున్నారు."

"వగలాడి! ఏమీ సంబంధంలేదూ? నీ నిక్షేపము లాంటి ఉద్యోగం మానుకొని ఈ హోటలు ఉద్యోగానికి ఎందుకొచ్చావు? పత్రికలో నీవూ ఇతనూ కలసికులుకుతున్న ఫోటో చూడలేదా?"

"అయితే ఆ ఫోటో చూచారన్నమాట!"

"ఆఁ, చూచాను ఈ దౌర్భాగ్యుడికీ, నీకూ సిగ్గూ, సెరమూ లేకుండా ఆ రోజునుంచి ప్రతిరోజూ చేస్తున్న పనులు. బుద్ధిలేకపోయె, సిగ్గులేకపోయె. మీరు మనుష్యు లేనా?"

"అమ్మా, నన్ను అంటే అన్నావు. నీ భర్తను అలా నిందించటం తగదు."

"చెప్పొచ్చావులే కులటా"

"మీరేమన్నా నాకు సమ్మతమే. నేను నా జీవితంలో కొత్త అధ్యాయం మొదలు పెట్టాను."

"అవు నిప్పుడు, చిదంబర అధ్యాయం మొదలు పెట్టావు"

"లేదమ్మా! మీరు మీ భర్తను అంతగా ప్రేమిస్తూ ఇలా నిందించటం సబబుగాలేదు."

"ఎవరు చెప్పారు, నేను ప్రేమించుతున్నానని! ఎప్పుడో బ్రతికున్న రోజులలో బుద్ధితక్కువై ప్రేమించాను. బజారు ముండలచుట్టూ తిరిగే ఈ దౌర్భాగ్యుణ్ణి నేనేమీ ప్రేమించటంలేదు. ఇతనొక మానవుడా? నన్ను యమ యాతనపెట్టి చంపుకుతింటున్నాడు కొన్నేళ్ళుగా. బ్రతికి వున్నా నన్నమాటేగాని రోజూ క్షణక్షణమూ చస్తూనే వున్నాను"

"చస్తే పీడావదలి పోతావు" అన్నాడు చిదంబరం.

"నాచావు కోరుతున్నావని నాకు తెలుసు. అది నా చేతిలో పని కాదుగా?"

"అంతకష్టమైతే మీరీయనని వదలి వెళ్ళవచ్చును గదా?"

"అవును వెళ్ళవచ్చు. మీరిద్దరూ కులకవచ్చు"

"లేదమ్మా! మీకా భయం అక్కరలేదు. మీరెక్కడకు వెళ్ళితే అక్కడకు నేనుకూడా మీతోవచ్చి మీ యింటి పనిచేస్తాను.

"నీ ఆదరానికీ సలహాకూ అభినందనలు. కాని నా బొందిలో ప్రాణమున్నంతవరకూ నేను ఇతనిని వదలివెళ్లను. నన్ను నానా బాధలూపెట్టి చంపుకు తినలేదా? నేనూ ఇతనిని బాధలుపెట్టి నాకసి తీర్చుకోవాలి"

"దానివల్ల మీకువచ్చేలాభం?"

"నాకేమీ లాభంలేదు. ఇలా అతనితో జీవించటం నరకంవంటిది. అయినా నాతోపాటు సుఖం అనుభవించనప్పుడు నాతోపాటు దుఃఖమైనా అనుభవిస్తుంటే నాకు కొంత సంతృప్తి"

"అహా ఎంత ప్రతివ్రతవే" అన్నాడు చిదంబరం.

"పతివ్రతలు కానివాళ్ళకు పతివ్రతలతో పనేమిటి?"

"పరపురుషులను అంటనంతమాత్రమున పతివ్రతలు కాజాలరు."

"నేను పతివ్రతనని నేనేమీ చెప్పుకోలేదు. పరస్త్రీతో నీకసలు సంపర్క మెందుకు? నేను పరపురుషునితో తిరగనప్పుడు నీ వెందుకు తిరగాలి?"

"నేను వద్దన్నానా? నీకు చేతగాక ఊరుకుంటే నేనేమి చేయగలను?"

"అందులో చేతగావటం చేతగాకపోవటం కూడా వుందా! పరపురుషుని చేరటంకూడా ఒక గొప్పేనా? నీవంటి నీచబుద్ధివుంటే ఎంతమందినైనా చేరవచ్చు."

"అది బుద్ధితో నిమిత్తంలేదు. ఏది, చేతనైతే లేచిపో ఎవరితోనైనా!"

"అవును పోతే-నాభార్య ఎవనితోనో లేచిపోయింది, నాకు విడాకులు కావాలనటానికా? నేను మాత్రం నీకట్టి అవకాశం చచ్చినా యివ్వను."

"చస్తే నీ విచ్చేదేమిటి."

"అందుకే చావను."

మంజువాణి ఈ అంతులేని వాగ్వివాదాన్ని విని విసుగు పుట్టి మెల్లగా జారుకుంది. తను వచ్చినపని మర్చిపోయి వెళ్ళిపడుకుంది.

కాని ఉదయమే లతవచ్చి చెప్పింది.

"రాత్రి ఎంత ప్రమాదం జరిగిందో తెలుసా. చిదంబరం తన భార్యను హత్యచేశాడు. హత్యచేసి పోలీసుల వద్దకువెళ్ళి హత్యచేసినట్లు ఒప్పుకున్నాడు."

"హత్య చేశాడా...?"

---

# 17

మంజువాణి విపరీతంగా భయపడిపోతోంది. ఆమె తన జీవితంలో అంతటి విపరీతమైన గుండెదడను ఏనాడూ పొందలేదు.

శ్రీమతి చిదంబరం హత్యకూ, తనకూ సంబంధం కల దనే భావం ఆమెలో ఏర్పడింది. కనీసం పోలీసులు తనను కేసులో ఇరికించడానికి అవకాశం కలదని, పోలీసులు తనపై నేరంమోపినా, లోకం నమ్మడానికి వీలున్నదనీ ఆమె ఆందోళన చెందుతున్నది.

నిజానికి ఆ హత్యకూ, తనకూ ఎలాంటి సంబంధం లేదు. తాను చేసిన నేరమేమిటి? ఆభార్యాభర్తల దాంపత్య జీవితంలో రాజుకొంటున్న అగ్నిని చల్లార్చి, పంశోవ మయం చేయాలన

ప్రవేశించింది. క

గుడిలోకం

మంజువాణి మనస్సు సంఘర్షణతో, సంక్షోభంతో ఉక్కిరి బిక్కిరైపోతున్నది. ఆమెకు ఊపిరి ఆడనంత పని అయింది. ఆకలిదప్పులు మరిచిపోయింది. కంటినిండా కునుకు లేదు. మనస్సులో శాంతి కరువైనప్పుడు మానవుడు ఎలాంటి యమయాతనలు అనుభవిస్తాడో, ఆమెకు ఇప్పుడు అర్థమౌతున్నది.

కొత్త జీవితాన్ని ప్రారంభించాలని బయలుదేరిన మంజువాణి ఒక అమాయక స్త్రీ హత్యకు పరోక్షంగా కారణమైంది. ఆ భావనే భయమై ఆమెను పట్టుకు పీడిస్తున్నది.

ఆమె ఆ హోటల్ గదిలో ఉండలేకపోయింది. పోలీసులువచ్చి, ఎక్కడ పట్టుకుపోతారోనని హడలిపోతున్నది. తీరా పారిపోతే, అదెక్కడ నేరమైపోతుందోనని మరొకవైపున మనస్సు పీడిస్తోంది.

పోలీసుల న్యాయపాలన ఎలాంటిదో ఇంతకుముందు ఆమెకు అనుభవంలోకి రాలేదు. ఎర్రటోపీ పోలీసులు ఆమె [illegible]లో ప్రత్యక్షమయ్యేసరికి, ఆమె గుండెల్లో రైళ్ళు పరు

[illegible]ంటే, తరువాత

[illegible]జువాణి

కొంది. తన స్వగ్రామంనుంచి నగరానికి పారిపోయివచ్చిన రోజులు గుర్తుకొచ్చాయి. సరిగ్గా మళ్ళీ అదే పరిస్థితి.

విడిచివచ్చిన నగరంలో తనకు బ్యాంకు ఎకౌంట్ వున్నమాట నిజమే. కాని, గడవకపోతుందా అన్న భరోసాతో, దానిని ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడంలో ఆమె కాలయాపనచేసింది. ఇంతలోకి ఈ ముప్పు ముంచుకొచ్చింది.

ఈ ప్రమాదంనుంచి భయటపడటానికి శ్రీహరి దరిజేరితే మంచిదన్న అభిప్రాయం ఆమెకు కల్గింది. కాని, ఆ శ్రీహరి ఎక్కడ దొరుకుతాడు? ఎక్కడున్నాడు? ఆ భోగట్టా తనకేమీ తెలియదు. అసలే కొత్తప్రాంతం, అందులో విపత్తు ఇంకా చెప్పాలా! ఆ అబల మనఃస్థితి ఎలా వుందో!

ఆమెకు ఎక్కడకు వెళ్ళాలో తోచలేదు. అలా వీధిన పడి కాలినడకను ముందుకు సాగింది. వీధిలో ప్రతి వెధవా తనవంక అదేపనిగా చూస్తున్నాడు. వారంతా తనవంక అనుమానంతో చూస్తున్నారో, లేక ఆశతో చూస్తున్నారో ఆమెకు అర్థంకాలేదు.

"ఏయ్ పిల్లా, మాట" అని ఒక పోకిరీ వెధవ ఎవడో హిందీ భాషలో మంజువాణిని పిలిచాడు. చివరకు అలగా జనానికి కూడా తాను ఇలా అలుసు అయిపోయానే అని ఆమె లోలోన బాధపడింది.

బజారులో పట్టుకొని అంత అసహ్యంగా, మొరటుగా తనను కేకవేసిన తుంటరిని మరొకప్పుడైతే, కాలి చెప్పుతో, చెంప చెళ్ళుమనిపించే దానిని అనుకొంది ఆమె.

కాని, అలాంటి సాహసం ఆమెకు ఇప్పుడు లేదు.

మరికొంత దూరం ముందుకు సాగింది.

ఆ తుంటరి ఇంకా ఆమెను వెంటాడుతూనే వున్నాడు.

ముందు నలుగురైదుగురు పోలీసులు కన్పించారు. వారు తనకోసమే వెతుకుతున్నారేమో అని ఆమె భయ పడింది.

అసలు భయమన్నది మనస్సులో ప్రవేశించనేకూడదు. కాని, ఒకసారి ప్రవేశించిందా, మన నీడను చూసుకొని మనమే భయపడుతుంటాము. ఆమె పరిస్థితి అక్షరాలా అలాగేవుంది.

ఆ రౌడీ వెధవ తనను వదలిపెట్టేటట్టు కన్పించడు. ఏమిచేయడానికి ఆమెకు తోచలేదు. ఆ రౌడీకూడా మంజు వాణి నిస్సహాయస్థితిని పసికట్టినట్టున్నాడు. అందుబాటులో వున్న పిట్టను ఏమైనా సరే వదలకూడదని నిశ్చయించుకొని, ఆమెను వెన్నాడుతున్నాడు.

దిక్కుతోచక ఆమె టక్కున ఆగిపోయింది. విజయ గర్వంతో చిరునవ్వులు ఒలకబోస్తూ, ఆ రౌడీ ఆమెను సమీ పించాడు.

"ఆపదలో వున్నాను ఆదుకో" అంటూ ఆమె వచ్చీ రాని ఇంగ్లీషులో అతనిని ప్రాధేయ పడింది.

"ఆదుకోవడమేమిటి, చేదుకొంటాను" అనే భావం వ్యక్తంచేస్తూ అతను ఆమె చేయిపట్టుకొని వెనక్కు మళ్ళించి తీసుకుపోసాగాడు.

కటికివాని వెంటపడి పోతున్న నోరు వాయిలేని మేక పిల్లలాగా ఆమె అతనిని అనుగమించింది.

అతను ఆమెను ఒకఇంట్లోకి తీసుకుపోయాడు. అక్కడ నలుగురైదుగురు పేకాటలో మునిగితేలుతున్నారు.

"భలేదాన్ని పట్టుకొచ్చావ్‌రా బ్రదర్. ఇంతచక్కని పిట్ట ఎక్కడ దొరికిందిరా" అంటూ ఆ నలుగురైదుగురు ఒక్కసారి ఎగిరి గంతులేశారు. వాళ్ళ వికటాట్టహాసం చూస్తుంటే మంజువాణి గుండె గుభేలుమన్నది.

పాములపుట్టలో పడినట్టు అప్పటికికాని ఆమెకు స్ఫురణకు రాలేదు. అన్నీ పాములే, ఏపాము కాటునుంచి తాను తప్పుకోగలదు? పెనంలోనుంచి పొయ్యిలోపడిన చందమైంది.

ఆమె మనస్సులో గతమంతా ఒక్కసారి సినిమారీలులాగా తిరగసాగింది. మదన్‌మోహన్ చెప్పినట్టు ఒప్పుకుంటే ఈ తిప్పలు తప్పేవికదా? కనీసం శ్రీహరి చేతిలో దెబ్బతిన్న తర్వాతనైనా మదనమోహను దగ్గరకు వెడితే! అతను తనను క్షమించి చేరదీసేవాడుగదా? పోనీ హోటలునుంచి కదలకపోయినా బాగుండేది. వీధినపడినా, వీడివెంటపడిరాకుండా వున్నా బాగుండేది.

జరిగినదానికి వగచి లాభమేమిటి?

వారందరూ గుసగుస లాడుకొంటున్నారు. అక్కడినుంచి పారిపోవాలని మంజువాణి ప్రయత్నించింది. కాని, చేజిక్కిన రంభను అంత తేలికగా పోనిచ్చే చవటలా వాళ్ళు!

తనను వెంటపెట్టుకొని తీసుకొచ్చిన వ్యక్తివచ్చి మంజువాణిని బలవంతంగా గదిలోకి లాక్కుపోయాడు. మిగతా

వ్యక్తులు తమ చాన్స్‌కోసం గుటకలు మ్రింగుతూ, ఆతృతతో ఎదురుచూస్తున్నారు.

మంజువాణి జీవితంలో ఇంతకుముందు ఎన్నడూ జరగని దారుణం జరిగింది. ఆమె పతిత. నిజమే. కాని, ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా, ఎవరూ, ఎన్నడూ ఆమెవంటిమీద చేయి వేయలేదు.

కాని, నేడు బలాత్కారంగా అమె మానాన్ని దోచుకొన్నారు నీచులు. మానభంగానికి గురి అయింది. ఒకసారి కాదు ఒకరిచేత కాదు. అయిదుసార్లు,అయిదుగురు వ్యక్తులచేత.

నాథుడులేని స్త్రీగతి ఏమిటో ఆమెకు ఆ క్షణాలలో అనుభవమైంది.

ఆమె వలవల ఏడ్చింది, బాధభరించలేక. బిగ్గరగా కేకలువేస్తూ విలపించి పళ్ళు పటపట కొరికింది. ద్వేషంతో ఆమె హృదయం అట్టుడికిపోతోంది. ఇష్టమొచ్చినట్టు తిట్టుకొంది. కాని, లాభం ఏమిటి?

ఆ రసప్రియులకు, శృంగార పురుషులకు-అవేవీ పట్టలేదు. తమ పని తాము పూర్తిచేసుకొన్నారు. వారికి కావలసింది అదే.

కొందరు తమ పరిస్థితిని తమంత తామే గ్రహించుకొంటారు. మరికొందరు ఇతరులు చెప్పితే గ్రహిస్తారు. ఇంకొందరికి మాడు పగిలితేకాని, కన్ను తెరవరు.

మంజువాణి ఇప్పటికి కన్ను తెరిచింది.

కటికినేలపైనుంచి ఆమె లేవలేకపోయింది. చెప్పనలవికాని బాధను అనుభవిస్తోంది. ఆమెకు జీవితంమీద నిజంగా

విరక్తి కల్గింది. తన జీవితం ఇలా మట్టిపాలైపోతుందని ఆమె కలలోకూడా వూహించలేదు. ఆ నీచులు ఆమెను ఇంటిలో నుంచి బయటకు గెంటి తలుపు వేసుకొన్నారు. తనకు జరిగిన ఘోరమైన అన్యాయాన్ని ఆమె ఏ న్యాయస్థానానికి ఫిర్యాదు చేసుకోగలదు? చేసుకుంటేమాత్రం న్యాయం విచారించే దెవరు? అందరూ తననే నిందిస్తారు.

ఆమె నడవలేక నడవలేక నడుస్తూ, ముందుకు సాగింది. అలా బజానన పోతుంటే ఏదో అనాధ శరణాలయం కన్పించింది. శవాకారంలో మంజువాణి శరణాలయంలో ప్రవేశించింది.

ఆమె తన పరిస్థితిని శరణాలయ నిర్వాహకురాలికి నివేదించింది. ఆమెకు ఆ శరణాలయంలో స్థానం దొరికింది. పది రోజులక్రితంవరకూ అనాధలకు ఆశ్రయమిచ్చినతాను, ఈనాడు అనాధగా మారిపోయింది. మరొక అనాధ శరణాలయంలో ఆశ్రయం పొందుతున్నది. ఆమెకు వైరాగ్యభావం కల్గింది. తాను ఎందుకుపుట్టినట్టు? తాను ఎందుకు బ్రతుకుతున్నట్టు? జీవితంలో తాను అనుభవించినదేమిటి? నడమంత్రపు సిరిని నమ్ముకొని, అహంకారాన్ని పెంచుకొని, తాను చివరకు సాధించిందేమిటి? పాతికేళ్ళ జీవితంలో ఆమె అన్నిరకాల అనుభవాలూ పొందింది. కాలచక్రంలో తాను అణువు మాత్రమే అన్న భావం ఆమెకు ఇప్పుడు కలుగుతోంది.

ఈ పాడు బ్రతుకుకన్నా ఆత్మహత్య మేలని ఆమె అనుకొంది. కాని, ఆత్మహత్యకు ఆమె సాహసించలేక పోతున్నది. ఆమెకు ప్రాణంమీద మమకారం చావలేదు.

మదన్ మోహన్ దగ్గరికివెళ్ళి జీవితాన్ని హాయిగా గడుపుదామన్న ఆశకూడా కలగకపోలేదు. కాని, అది సాధ్యమా? అయినా ఆశలకు సాధ్యాసాధ్యాలతో నిమిత్త మేమిటి? గాయపడిన మనస్సుకూ శరీరానికీ అనాథ శరణాలయంలో చికిత్స చేసుకొంటూ, ఆమె భవిష్యత్తును గురించి కలలు కనసాగింది.

దుర్భర పరిస్థితులలోసైతం మానవులను బ్రతికించ కల్గిందే ఆశ. ఆశతోనే ఆమె బ్రతుకుతోంది.

ఇవాళ కాకపోతే, ఒకనాటికైనా తాను తిరిగి మంచి స్థితికి చేరుకొనగలనని ఆమె విశ్వాసం. ఎంతవరకు నెరవేరుతుందో ఎవరు చెప్పగలరు?

కొత్త జీవితాన్ని ప్రారంభిద్దామని, 'కైలాసగిరి' కి వెళ్ళిన మంజువాణి హఠాత్తుగా వైతరణిలో పడిపోయింది. వైతరిణి ఈది, ఆమె తిరిగి గట్టెక్క కలుగుతుందా?

# 18

అనాధ శరణాలయంలో, అనాధగా పడివున్న మంజు వాణికి మదన్ మోహన్ హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. తలవని తలంపుగా తటస్థపడిన ఆ సన్నివేశం వారిద్దరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది.

సిరిగల మదన్ కన్పించగానే మంజు మనసులో ఆశలు కొత్త చిగుళ్ళు తొడిగాయి. ఇక తన జీవితం కొత్త రేకులు తొడుగుతుందని ఆమె ఆశపడింది. రెండు రోజుల క్రితం, అంతకు అయిదు రోజుల పూర్వం సంభవించిన సంఘటనలు ఆమె హృదయంలో కలకలేస్తూనే ఉన్నాయి. అయినా వాటిని మరచి పోవడానికే ప్రయత్నిస్తున్నది.

కాని మదన్ గతాన్ని అంత తేలికగా విస్మరించలేడు. అదంతా మర్చిపోవడం ఇలలో జరగని కలలోమాట.

నదీ ప్రవాహంవలె ఉరకలెత్తుతూ, ఉత్సాహంలో లేడిపిల్లవలె, అహర్నిశలూ గంతులేస్తూండే మంజు దీనావస్థను చూసి మదన్ విచారించాడు, పీక్కుపోయిన మొఖం. కళావిహీనమైన కళ్ళు, కచభారంతో కుచభారాన్ని మోస్తున్న జాకెట్ – ఈ దృశ్యం చూసి మదన్ నిజంగా జాలిపడ్డాడు.

ఆమె తనను ఘోరంగా మోసగించింది. అవమానించింది. అనాథావస్థలోవున్న ఆమెను చూస్తుంటే అతనిలో ద్వేషం రగులలేదు. కరుణా భావమే జనించింది.

ఆమె అతని చేతులు పట్టుకొని, ప్రాధేయపడింది, ప్రతిమాలుకొంది.

"క్షమించు మదన్. వళ్ళు తెలియని స్థితిలో మిమ్మల్ని అవమానించాను, ఫలితం అనుభవించాను. ఇప్పుడు కళ్ళు తెరిచాను. మన్నించండి. మీరు చాలా మంచివారు"

"మంచివాళ్ళకు ఇవి రోజులుకాదు. మోసకారులకు కాలం ఇది"

"చచ్చిన పామును చంపబూనినందువల్ల ప్రయోజనం లేదు"

"ఉన్నమాట అన్నాను. నిన్ను గురించి మాత్రం కాదు. లోకం పోకడ అలావుంది."

"మరి మీరు నన్ను క్షమించినట్టేనా?"

"క్షమించడానికి నే నెవరిని?"

కొద్ది క్షణాలపాటు మంజువాణికి గొంతు పెగలలేదు. లోపలి భావం పెకిలి రాలేదు.

"మీరు నాకు కాబోతున్న భర్తగారు గదా?"

"ఇంకా కలగంటున్నావా? కలలు నెరవేరే కాలం ఇంకారాలేదు. మనిద్దరికీ వివాహం జరగడం అసంభవం?"

మంజువాణికి మిన్ను విరిగి మీదపడి నట్లయింది.

"ఎందుచేత? కులటనని సందేహిస్తున్నారా? వివాహం గురించి నా హృదయంలో ఆశలు రేగించినది మీరే. చిగురించిన ఆ ఆశలు మీరే నాశనం చేస్తారా?"

"అగ్ని సాక్షిగా పరిణయమాడిన భార్యనాకువున్నది. పిల్లలు వున్నారు. వారికి అన్యాయం చేయలేను"

"ఈ విచక్షణ అప్పు డేమైంది? అయినా, మీ భార్యకు, బిడ్డలకు అన్యాయం చేయమని నేను కోరలేదే! అలా కోరే హీనురాలను కూడా కాను."

ఆమె కనుకొలకులనుంచి కన్నీటిధార బొటబొటా జాలువారింది. చెక్కిళ్ళమీద కన్నీట కాలువ ఏర్పడింది. ఆ దృశాన్ని అతను చూడలేకపోయాడు. ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు.

"నాకు బుద్ధిలేనప్పుడు, బుద్ధిరానప్పుడు మీరు పెళ్ళి ప్రసక్తి తెచ్చారు. నేను బుద్ధి తెచ్చుకొన్న పిమ్మట, మనస్సు మార్చుకున్న పిదప, మీరే దానిని కాదంటున్నారు. ఎంత విచిత్రం. మీరు మోసానికి వశులవుతారు. న్యాయానికి లొంగరు. విచిత్రంగా వుంది."

"కనువిప్పు అయిన వ్యక్తి కన్ను గప్పడం సాధ్యం కాదు."

"అలాంటి బుద్ధి నాకులేదని ఇంతకు ముందే చెప్పాను."

"క్షణికోద్రేకాలను మించిన క్షుద్రాలు లేవని నేను గ్రహించాను."

"అయితే నన్ను ఈ పతిత జీవితాన్నే జీవితాంతం వరకు కొనసాగించ మంటారా?"

"దానికి జవాబు చెప్పవలసింది నేను కాదు."

"తప్పించుకోవడానికి ఎన్నిమాటలైనా చెప్పగల్గిన నేర్పు మీకు వుంది."

ఆ క్షణంలో ఆమెకు ఆత్మహత్యే చేసుకోవడమే మంచిదన్న భావం కల్గింది.

"నాభార్య ఎంతో ఉత్తమురాలు. నన్ను నీవు అవమానపర్చినప్పుడు నాలో ద్వేషానలం రగిలింది. ఆ అనలాన్ని చల్లార్చింది నా అర్థాంగి. ద్వేషానికి మారు నాలో కరుణారసాన్ని జ్వలింపజేసింది. ఆమె క్షమతో నాలో దివ్యమైన అంబరీషము కలుగ చేసింది."

నిజంగా భారత స్త్రీ హృదయం ఎంతటి ఉన్నతమైందో, ఉత్తమమైందో మంజువాణికి ఇప్పుడు అర్థమైంది.

మంజువాణి మనస్సు రకరకాల భావాలకు ఆలవాలమైంది.

తనకు ఇక దారి ఏది? గోదావరేనా?

క్రొత్త జీవితాన్ని తాను ప్రారంభించగలదా?

ఆమెకు మహాభయంగా వుంది. ఏదో వొక అండ తనకు కావాలి. లేకపోతే ఈ లోకంలో తాను నెగ్గుకు రాలేదు. ప్రతి వెధవ తనను వెంటాడుతూ వేధిస్తాడు. మురికి కూపంలోకి పడద్రోస్తాడు, కుళ్ళు బతుకులోకి ఈడుస్తాడు.

"మదన్, మీ అండలేనిది నేను జీవించలేను. కనీసం మీ ఇంట్లో దాసిగానైనా వుండనీయండి. మీకు, పుణ్యాంగన మీ అర్ధాంగికి సేవజేస్తూ, జీవిత శేషాన్ని గడవనీయండి"

"నీవు దాసిగా వుండదగిన వ్యక్తివి కాదు."

అసూర్యంపశ్యవు దాసిగా ఒక్కక్షణం వుండలేవుకూడా. ఇది సినిమా, నాటక రంగముకాదు. జీవితంలో నీ పాత్ర చాలా కష్టము. నరనారీ నికేతమువారు నీకు ఉద్యోగము యివ్వగలరు.

"నన్ను ఎగతాళి చేయుచున్నారా? వ్యభిచారం ఎంత నికృష్టకరమైందో తెలుసుకున్నాను. శరీరాన్ని భోగములకై అమ్ముకుని మీ జీవితాన్ని నా జీవితాన్ని నాశనం చేశాను. పైగా ఎంతమంది గృహాల్లోనో చిచ్చుబెట్టాను."

"నా జీవితము నాశనము చేశానని నీవేమీ దిగులు పడనక్కరలేదు. సౌజన్యరాశైన నా భార్యవలన నాకుగాని, నాకుటుంబానికిగాని ఎట్టి నష్టమూ కలుగలేదు. నిన్ను నేనేమి ఎగతాళిచేయుటలేదు. నీతో ఎకసక్కాలాడే తరుణమూ కాదు."

"నేను పరితపించానంటే మీరు నమ్మటము లేదు కదా?"

"నీ పరితాపము ప్రసూతివైరాగ్యము వంటిదని నా అనుమానము. పరితాపానికి ప్రాయశ్చిత్తానికి చాలా బేధమున్నది."

"నేను అజ్ఞానిని. నాకు మీవలె పాండిత్యములేదు. ఈ జానెడు పొట్టను ఎట్లాగో పోషించుకోలేక పోతానా!"

"కత్తుక_ర్తి పనులు చేయకుండా వుండాలిగా!"

"నా మాటలలో మీకింకా నమ్మకము కలుగలేదన్న మాట! నాకు మీ నరనారీ నికేతములో వుద్యోగము అక్కర లేదు."

"నీ అహంకారము అంతరించేవరకూ నీకు మోక్షము లేదు. ప్రపంచంలో నీకు చిల్లిగవ్వ విలువలేదు."

"నిజమే నాకు చిల్లిగవ్వ విలువలేదు. కాని నాకు కూడా హృదయం వుంటుందని మీకు తెలియదన్నమాట!"

"హృదయం వుండవచ్చు, వుండకపోవచ్చు. నీకు యింకా పశ్చాత్తాపము కలుగలేదు. నీ జీవితములో పరి వ_ర్తనకు అవకాశమున్నట్లు కనబడుటలేదు."

"ఆ ఉద్యోగం ఇంకో అభాగ్యురాలికి యిప్పించండి. మీరు నమ్మినా నమ్మక పోయినా ఆ సర్వేశ్వరునికి నిజము తెలుసునుగదా? శెలవు. ఈ దినమే నేను శ్రీ అరవిందా శ్రమమునకు వెళ్ళి అక్కడే నా జీవితాంతమువరకూ కాల క్షేపము చెయ్యాగలను."

"శుభము" వెళ్ళుచున్న మంజువాణిని చూస్తూ మన స్సులో "ఆశ అంతరించదు. ఆశాజీవి శరణ్యాం మతము. అంతకన్నా గత్యంతరం వున్నదో లేదో - అనంతం."



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA109 13187 |
| పుస్తకం పేరు | చెలి గువ్వ |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | , 123 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |